# అడ్వాన్స్‌డ్ టెక్నాలజీ తో ఇక సంతానం సో ఈజీ



## తెలుగు రాష్ట్రాల్లో ప్రఖ్యాతి గాంచిన సంతాన వైద్యనిపుణురాలు డాక్టర్ పద్మలత యారాశి వెల్లడి

## సంతానరాహిత్యంతో అలమటిస్తున్న వేలాది కుటుంబాల్లో పసిపిల్లల చిరునవ్వులు చిందిస్తున్న సక్సెస్‌ఫుల్ డాక్టర్

ప్రశ్న: డాక్టర్‌పద్మ గారికి నమస్కారం నా వయస్సు 28 సంవత్సరాలు. నా భర్తకు 32 సంవత్సరాలు.పెళ్లయి రెండు సంవత్సరాలు అవుతోంది. మా పుట్టింట్లో కొన్ని సమస్యల వల్ల నేను మొదటి సంవత్సరంలో ఆరు నెలలు, రెండవ సంవత్సరంలో ఆరు నెలలు పుట్టింట్లోనే ఉండి పోవాల్సి వచ్చింది. మిగిలిన కాలమంతా నేను నా భర్తతో కాపురం చేసాను. అయినా మాకు పిల్లలు పుట్టలేదు. ఈ మధ్య ఒక డాక్టర్‌కు చూపించుకుంటే.. మా వారికి ఏ సమస్యా లేదని, నాకు మాత్రం గర్భాశయం లోపలి పొరలు పొట్ట అడుగు భాగంలోకి చేరిపోయాయని.. అందువల్లే పిల్లలు పుట్టటం లేదని చెప్పారు. దీనికి తోడు నాకు థైరాయిడ్ సమస్య ఉంది. నిద్ర కూడా సరిగా పట్టట్లేదు. డాక్టర్ సలహా మేరకు హార్మోన్స్ సమస్య తగ్గడానికి మందులు వాడుతున్నాను. దయచేసి నా సమస్యలకు పరిష్కారం తెలుపగలరు.

పి. శారద, భువనగిరి

**జవాబు:** ఈ ప్రకృతి మనకు అన్నీ ప్రసాదిస్తుంది. మనమే నిర్లక్ష్యంతో ప్రకృతిని వికృతిగా మార్చుకుంటున్నాము. కొన్ని సమస్యలు తప్పని సరై బాధపెడతాయి. కానీ., చాలా సమస్యలు మనం చేసే తప్పులవల్లే ఎదురవుతాయి. మీ పుట్టింట్లో సమస్యలున్నాయని మీకు పెళ్లయిన రెండు సంవత్సరాలలో, సంవత్సరం పాటు భర్తకు దూరంగా ఉండటం మీ మొదటి తప్పు. సమస్యలనేవి వస్తూ ఉంటాయి పోతూ ఉంటాయి. దాన్ని నెపంగా పెట్టుకొని భర్తను, సంసారాన్ని దూరం చేసుకోకూడదు. ఇది చాలా మంది స్త్రీలు చేస్తున్న పొరపాటు. మీ రిపోర్ట్స్ పరిశీలించిన మీదట., మీరు ఎండోమెట్రియాసిస్ తో బాధ పడుతున్నారని తేలింది. మెన్సెస్ టైంలో స్త్రీల యొక్క గర్భాశయంలోని లోపలి పొరలు సహజంగానే బయటకు వెళ్ళిపోతాయి. కానీ. అలా జరగకుండా. ఆ పొరకు పొట్ట అడుగు భాగంలోకి చేరిపోతే దానిని ఎండోమెట్రియాసిస్ అంటారు. దీని వల్ల సాఫీగా ఉండవలసిన అండవాహికల స్థానం మారిపోతుంది. అండ వాహికలో ఏ అవరోధాలు లేనపుడే. స్త్రీ అండాలు పురుషుడి శుక్రకణాలతో సంయోగం చెందుతాయి. అప్పుడే సంతానయోగం కలుగుతుంది. మీ విషయంలో మీకు విడుదలైన అండాలు సరైన దిశలో పయనించటంలో ఫెయిలవుతున్నాయి. అందుకే మీరు గర్భం దాల్చటం లేదు. గర్భాశయంలో ఇన్‌ఫెక్షన్లు, ఈస్ట్రోజన్, ప్రొజెస్టిరాన్, హార్మోన్ల హెచ్చుతగ్గులు,పిట్యూటరీ గంధుల ఇబ్బందుల వల్ల ఎండోమెట్రియాసిస్ వస్తుంది. మీకున్న హైపోథైరాయిడ్ కూడా ఎండోమెట్రియాసిస్ రావడానికి ఒక కారణం. ఇవన్నీ కాకా మీరు మానసిక సమస్యలతో బాధపడుతున్నారు. అందువలన మీకు సంతానం కలగటంలో ఇబ్బందులు ఎదురయ్యాయి. మీ సమస్యల్ని వివరంగా పరిశీలించి తగిన చికిత్స చేస్తే సంతానం మీ సొంతమవుతుంది. కొంత వ్యాయామం,ఇంకొంత కౌన్సిలింగ్ మరికొంత మందులతో మీ సమస్య తప్పకుండా పరిష్కారమవుతుంది. ముఖ్య విషయం ఏమిటంటే మీరు వాడే హార్మోన్ల సప్లిమెంట్స్ బదులుగా.. మీరు తినే ఆహారంతోనే హార్మోన్ల హెచ్చుతగ్గుల్ని నియంత్రించకోవచ్చును. అందుకు మీరు చేయాల్సింది. మీ ఆహారంలో మార్పులు, పల్లీలు, గుడ్లు, వాల్‌నట్స్, డార్క్ చాక్కెట్లు తీసుకోవటం వల్ల జింక్ మరియు ఒమెగా త్రీ అధికంగా లభించి. ఒత్తిడి తగ్గి, మానసిక ఆందోళనలు దూరమై, ఎంతో ఉపశమనం లభిస్తుంది.

ప్రశ్న: డాక్టర్ పద్మ గారికి నమస్తే.. నేనొక డాక్టర్‌ని జనరల్ ప్రాబ్లమ్స్‌కు మాత్రమే ట్రీట్‌మెంట్ ఇస్తూ ఉంటాను. నా దగ్గరకు వచ్చే పేషెంట్లలో కొంత మంది సంతానలేమితో బాధపడుతుంటే.. వారికి మీ పేరు సూచించటం వారు మిమ్మల్ని సంప్రదించటం జరిగింది. మీరు అందించిన చికిత్సలో చాలామందికి సంతానం కలిగింది. మంచి డాక్టర్ దగ్గరికి పంపించటం వల్లే మంచి ఫలితం వస్తుందని అందరూ నన్ను అభినందిస్తుంటే. ఆనందంతో మీకు ఈ ఉత్తరం రాస్తున్నాను. మీరు టైం కేటాయిస్తే.. మా ఏరియాలో అవేర్‌నెస్ ప్రోగ్రాం పెట్టాలని ఉంది

డాక్టర్ కడక్‌సింగ్, రాయదుర్గ, షేక్‌పేట.

**జవాబు:** డాక్టర్ కడక్ సింగ్ గారికి కృతజ్ఞతలు. మీ గురించి విన్నాను. నా దగ్గరకు వచ్చిన దంపతులు మీ గురించి, మీ వైద్యం గురించి గొప్పగా చెప్పారు. సమస్యలతో బాధపడే దంపతులను మీరు నాదగ్గరికి పంపించటం. వారికి నేను చికిత్స అందించటం ద్వారా సంతానం కలగటం. నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను.

మీరు ఏర్పాటు చేసే అవేర్‌నెస్ ప్రోగ్రామ్స్ కు నా సహాయ సహకారాలు ఉంటాయని సవినయంగా మనవి చేస్తున్నాను.

ప్రశ్న:డాక్టర్ పద్మ గారికి నమస్తే ప్రైమరీ ఇన్‌ఫెర్టిలిటీ,సెకండరీ ఇన్‌ఫెర్టిలిటీ, సమస్యలు ఎలా ఉంటాయి? వాటికి మీ దగ్గర తగిన చికిత్సా విధానాలున్నాయా?

అశోక్, నార్సింగి.

**జవాబు:** తాళం ఉందంటే. తప్పకుండా దానికి తాళం చెవి కూడా ఉన్నట్టే అలాగే సమస్య ఉందంటే తప్పకుండా దానికి పరిష్కారం కూడా ఉన్నట్టే. దంపతులు మధ్య శారీరక కలయికలు సక్రమంగా ఉన్నా. స్త్రీలలో అండాలు, పురుషుడిలో వీర్యకణాలు ఉత్పత్తి అవుతున్నా ఇంకా పిల్లలు పుట్టటం లేదంటే. అది ప్రైమరి ఇన్‌ఫెర్టిలిటీ. ఒకసారి పాపో,బాబో పుట్టి మళ్ళీ గర్భం దాల్చకపోవటం, ఒకసారి నెల తప్పి ప్రమాదవశాత్తు గర్భవిచ్ఛిత్తి కావటం, లేదా వాంటెడ్‌లీ అబార్షన్ చేయించుకోవటం తర్వాత ఎంతకాలం ఎదురు చూసిన మళ్ళీ పిల్లలు పుట్టక పోవటం అంటే.. అది సెకండరీ ఇన్‌ఫెర్టిలిటీ. ఇవే కాకా స్త్రీలలో పురుషులలో అనేకానేక సమస్యల వల్ల అసలు సంతానం కలిగే అవకాశమే ఉండదు. అయితే ఆధునిక వైద్య విధానాల ద్వారా సంతానం పొందే అడ్వాన్స్‌డ్ టెక్నాలజీ మా వద్ద ఉంది.

ADVT



## మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్

### హైదరాబాదు

ప్లాట్ నెం: 29, రోడ్ నెం- 01, జూబ్లిహిల్స్, ఫిల్మ్‌నగర్, హైదరాబాదు. ఫోన్ : 9100222604

### తిరుపతి

మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
మా భూమి టవర్స్, డోర్ నెం: 18-1-302ఎ/ఎ1
భవాని నగర్, కెటి రోడ్, తిరుపతి ఫోన్ : 8099922895

### కోరమంగళ

మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
సైట్-2, బి బ్లాక్, 100 ఫీట్‌రోడ్, కోరమంగళ ఎక్స్‌టెన్షన్,
బెంగుళూరు. ఫోన్: 09108446553

### బెంగుళూరు

మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
57/1. ఈస్ట్‌పార్క్‌రోడ్, మల్లేశ్వరం.
బెంగుళూరు. ఫోన్: 09108446553

### హొసూరు

విజయ్ సృష్టి ఫెర్టిలిటి సెంటర్,
నెం: 76, ఓల్డ్ బెంగుళూరు రోడ్, హొసూరు
ఫోన్: 09944827846

### కర్నూలు

మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
డోర్‌నెం. 50-760, ఫస్ట్ ఫ్లోర్, విశ్వభారతి హాస్పిటల్ లేన్,
గాయత్రి ఎస్టేట్స్, కర్నూలు. ఫోన్: 7331164105



### ప్రొద్దుటూరు

## పద్మ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్

ప్రొద్దుటూరు, కడప జిల్లా.
ఫోన్ : 9100775988, 9100775987

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

63. కలశపూజలు (9ఒకేసారి) 150-00
64. కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) ....
65. హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) ....
66. గోమాత 40-00

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

1. శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు 45-00
పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం
2. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, 50-00
3. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, 50-00
4. స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) 99-00
5. లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి 63-00
6. స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ 108-00
7. సర్వదేవతా స్తోత్రమంజరి 120-00
8. సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) 24-00
9. విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) 25-00
10. లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) 36-00
11. లలితా సహస్రనామములు 24-00
12. లక్ష్మీ సహస్రనామములు 24-00
13. దుర్గా సహస్రనామములు 24-00
14. ఆంజనేయ సహస్రనామములు 24-00
15. శివ సహస్రనామములు 24-00
16. విష్ణు సహస్రనామములు 24-00
17. గణపతి సహస్రనామములు 24-00
18. సుబ్రహ్మణ్య సహస్రనామములు 24-00
19. గాయత్రి సహస్రనామములు 24-00
20. లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు 24-00
21. శ్రీరామా సహస్రనామములు 24-00
22. సరస్వతి సహస్రనామములు 24-00
23. సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం 24-00
24. శ్రీవేంకటేశ్వరసహస్రనామములు 24-00
25. మణిద్వీపవర్ణన (పెద్దది) 24-00
26. సంధ్యావందనం 24-00
27. మంత్రపుష్పమ్ ....
28. త్రిభాషా హనుమాన్‌చాలీసా 15-00
29. హనుమాన్ చాలీసా 10-00

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాథ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

| | | |
|---|---|---|
| 24. | శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. | ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. | షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. | సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. | సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. | నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. | శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. | హృదయంలో సాయి | 15-00 |
| 32. | శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్ఛరిత్ర) | 120-00 |
| 33. | గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | | |
|---|---|---|
| 1. | 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72-00 |
| 2. | గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. | ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. | ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 50.00 |
| 5. | ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. | కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 25.00 |
| 7. | గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 25.00 |
| 8. | శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25.00 |
| 9. | సాదా క్యాలండర్ | 5.00 |
| 10. | పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. | తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. | కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. | జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. | మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. | వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. | వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. | సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. | శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. | పూర్వ పరాశరి | 100-00 |
| 20. | పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. | ప్రశ్న సింధు | 99-00 |
| 22. | నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. | సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. | దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |

| | | |
|---|---|---|
| 25. | ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. | జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. | జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. | జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. | ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. | జాతక మకరందం | 63-00 |
| 31. | జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. | మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. | ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. | జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. | శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. | నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. | పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. | సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. | ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. | నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. | శుభశకునాలు | 30-00 |
| 42. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. | ముహూర్త దీపిక | 99-00 |
| 45. | పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. | కలలు ఫలితాలు | 30-00 |
| 47. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. | గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. | ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. | అంగసాముద్రికం | 36-00 |
| 55. | హస్త సాముద్రికం | 63-00 |
| 56. | లాల్ కితాబ్ | 99-00 |
| 57. | శకునశాస్త్రం | 63-00 |
| 58. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

| | | |
|---|---|---|
| 60. | అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. | బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. | లగ్నరత్నాకరం | 63-00 |
| 63. | షట్పంచాశిక | 120-00 |
| 64. | 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. | 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. | 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. | 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. | 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. | మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. | కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. | ముహూర్తచింతామణి | 99-00 |
| 72. | సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. | ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. | అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. | గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. | జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. | జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. | జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. | నాడీజ్యోతిషం | 63-00 |
| 80. | నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 81. | లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. | గౌతమసంహిత | 63-00 |
| 83. | హోరరత్నమాల | 63-00 |
| 84. | జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. | పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. | దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. | వింత జోష్యములు | 63-00 |
| 88. | షోడశవర్గులు | 200-00 |
| 89. | రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. | చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. | కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. | బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. | గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. | శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |

| | | |
|---|---|---|
| 95. | శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. | రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. | ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. | ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. | లఘుజాతకం | 63-00 |
| 100. | జాతకాలంకారము | 63-00 |
| 101. | మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. | వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. | మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. | కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. | సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. | కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. | తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. | వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. | ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. | మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. | కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. | మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. | నారద సంహిత | 200-00 |
| 114. | పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. | తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. | సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. | రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. | ఛాయాగ్రహములు | 99-00 |
| 119. | జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

## బి.వి.రామన్ గారి గ్రంథములు

| | | |
|---|---|---|
| 120. | జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 | గ్రహభావ బలములు | 50-00 |
| 122. | కాలచక్రదశ | 50-00 |
| 123. | అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. | జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. | పురోగామి జాతకం | 50-00 |
| 126. | భావార్ధరత్నాకరం | 75-00 |
| 127. | భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. | అష్టకవర్గ పద్ధతిః | 75-00 |

| | |
|---|---|
| 129. జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75-00 |
| 130. ప్రశ్నతంత్ర | 75-00 |
| 131. ముహూర్తం | 75-00 |
| 132. విశిష్ట జాతకములు | 125-00 |
| 133. భారతీయఫలితజ్యోతిషం | 125-00 |
| 134. 300 ముఖ్యమైన యోగములు | 125-00 |
| 135. జాతకంపరిశీలించడంఎలా ? | 300-00 |

## రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు

| | |
|---|---|
| 136. బృహత్పరాశరహోరాశాస్త్రము-1 | 200-00 |
| 137. బృహత్పరాశరహోరాశాస్త్రము-2 | 200-00 |
| 138. బృహత్పరాశరహోరాశాస్త్రము-3 | 200-00 |
| 139. బృహత్పరాశరహోరాశాస్త్రము-4 | 200-00 |
| 140. భావార్థరత్నాకరము | 100-00 |
| 141. ముహూర్త చింతామణి | 100-00 |
| 142. ముహుర్త చింతామణి-పార్టు2 | 200-00 |
| 143. స్వప్న శాస్త్రము | 36-00 |
| 144. శతయోగమంజరి | 50-00 |
| 145. వ్రతనిర్ణయకల్పవల్లి | 250-00 |
| 146. దైవజ్ఞవల్లభం | 75-00 |
| 147. వసంతరాజశకునమ్ (బృహత్శకునశాస్త్రం) | 250-00 |
| 148. వాస్తుశాస్త్రవివేకము-1 | 100-00 |
| 149. వాస్తుశాస్త్రవివేకము-2 | 200-00 |
| 150. వాస్తుశాస్త్రవివేకము-3 | 100-00 |
| 151. వాస్తుశాస్త్రవివేకము-4 | 200-00 |
| 152. అనుభవసులభవాస్తు - 1 | 50-00 |
| 153. అనుభవసులభవాస్తు - 2 | 100-00 |
| 154. పంచాంగ వివేకము | 99-00 |
| 155. వశిష్ఠ సంహిత | 360-00 |
| 156. పంచపక్షి శాస్త్రం (కేస్బైండ్) | 200-00 |

## 5. వాస్తులు

| | |
|---|---|
| 1. 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకొనండి | 180-00 |
| 2. వాస్తుశాస్త్ర రహస్యములు | 200-00 |
| 3. వాస్తునుబట్టి మీ ఇల్లు | 63-00 |
| 4. మీరూ మీ వాస్తు | 63-00 |

| | | |
|---|---|---|
| 5. | గృహవాస్తు చిట్కాలు | 63-00 |
| 6. | వాస్తు పూజ | 63-00 |
| 7. | వాస్తు సూత్రములు | 63-00 |
| 8. | వాస్తుశాస్త్ర రహస్యాలు | 63-00 |
| 9. | గృహవాస్తు వర్గులు | 99-00 |
| 10. | విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు | 63-00 |
| 11. | విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా మీఇండ్లఆయములు | 99-00 |
| 12. | విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాలగురుమూర్తిగుప్తా) | 180-00 |
| 13. | ఆధునిక గృహవాస్తు | 99-00 |
| 14. | శుభవాస్తు | 270-00 |
| 15. | వాస్తుయంత్ర రత్నావళి | 120-00 |
| 16. | వాస్తుశాస్త్రం | 120-00 |
| 17. | హౌస్ ప్లాన్స్ | 63-00 |
| 18. | గృహనిర్మాణ వాస్తు | 63-00 |
| 19. | వాస్తు రెమెడీస్ | 63-00 |
| 20. | గృహవాస్తు దర్పణం | 63-00 |
| 21. | జ్యోతిష-గృహవాస్తుచంద్రిక | 200-00 |
| 22. | వాస్తురత్నాకరం (కొండపల్లి) | 63-00 |
| 23. | వాస్తుశిరోమణి ,, | 120-00 |
| 24. | వాస్తుసంగ్రహమ్ ,, | 63-00 |
| 25. | పంచవాస్తు పారిజాతం ,, | 120-00 |
| 26. | వాస్తుడిండిమమ్ ,, | 63-00 |
| 27. | వాస్తుదుందిభి ,, | 120-00 |
| 28. | విశ్వకర్మవాస్తుప్రకాశిక (కేస్‌బైండ్) | 250-00 |
| 29. | కృష్ణవాస్తుశాస్త్రము | 63-00 |
| 30. | జలవాస్తు,శల్యవాస్తు (దంతూరిపండరీనాథ్) | 99-00 |
| 31. | మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120-00 |
| 32. | వాస్తు జ్యోతి | 63-00 |
| 33. | మన ఇల్లు-మనవాస్తు | 99-00 |
| 34. | వాస్తవ వాస్తుపూజావిధానము | 108-00 |
| 35. | వాస్తు దర్పణం | 120-00 |

## 6. మంత్రశాస్త్రాలు

| | | |
|---|---|---|
| 1. | మంత్రసాధన | 63-00 |
| 2. | తంత్రజాలం | 63-00 |
| 3. | మంత్రశక్తి | 63-00 |

| | | |
|---|---|---|
| 4. | దత్తాత్రేయ తంత్రవిద్య | 63-00 |
| 5. | దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 63-00 |
| 6. | తాంత్రిక పంచాంగం | 63-00 |
| 7. | యక్షిణీ తంత్రం | 63-00 |
| 8. | మంత్రానుష్ఠాన చంద్రిక | 63-00 |
| 9. | సర్వదేవతా మంత్రకవచములు | 63-00 |
| 10. | మంత్రాక్షరాలరహస్యం (బీజాక్షరనిఘంటువు) | 63-00 |
| 11. | సర్వదేవతా మంత్రరత్నావళి | 63-00 |
| 12. | సదాచార దీపిక | 63-00 |
| 13. | యోగినీ-వామకేశ్వరతంత్రం | 63-00 |
| 14. | ప్రపంచసారతంత్రం | 63-00 |
| 15. | బదనిక తంత్రమ్ | 63-00 |
| 16. | ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 63-00 |
| 17. | గుప్త సాధన తంత్రం | 63-00 |
| 18. | గంధర్వ తంత్రమ్ | 63-00 |
| 19. | సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 63-00 |
| 20. | యంత్ర మంత్ర తంత్ర | 63-00 |
| 21. | పాశుపత తంత్రం | 99-00 |
| 22. | పంచదశ మహాఖడ్గ తంత్రం | 99-00 |
| 23. | రుద్రాష్టాధ్యాయః | 99-00 |
| 24. | మంత్రసిద్ధి | 120-00 |
| 25. | పరశురామతంత్రమ్ | 108-00 |
| 26. | శ్రీలలితావిలోమ పంచదశీ | 108-00 |
| 27. | శ్రీ గురు తంత్రం | 108-00 |
| 28. | గాయత్రీ తంత్రమ్ | 108-00 |
| 29. | మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150-00 |
| 30. | శ్రీ దుర్గ తంత్రమ్ | 200-00 |
| 31. | మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 200-00 |
| 32. | సర్ప (నాగ)తంత్రం | 250-00 |
| 33. | హవన తంత్రం | 250-00 |
| 34. | షోడశనిత్యతంత్రం | 250-00 |
| 35. | శాక్తేయతంత్రం | 250-00 |
| 36. | రుద్రయామళతంత్రం | 250-00 |
| 37. | లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 38. | హిరణ్యశూలినీ తంత్రమ్ | 250-00 |

| | | |
|---|---|---|
| 39. | మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 40. | శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 41. | స్వర్ణాకర్షణభైరవతంత్రం | 250-00 |
| 42. | కాశీవిశాలాక్షి తంత్రం | 250-00 |
| 43. | శాంతితంత్రమ్ | 250-00 |
| 44. | యంత్రసిద్ధి | 360-00 |
| 45. | శ్రీ లక్ష్మీతంత్రమ్ | 360-00 |
| 46. | మంత్రమహోదధి (స్త్రీదేవతాఃకల్పమ్) | 360-00 |
| 47. | మంత్రమహోదధి (పురుషదేవతాఃకల్పమ్) | 360-00 |
| 48. | మంత్రశాస్త్రం (గ్రంథము) | 360-00 |
| 49. | ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360-00 |
| 50. | కామధేనువు తంత్రం | 360-00 |
| 51. | శూలినీదుర్గాతంత్రం | 360-00 |
| 52. | శ్రీవిద్య రహస్యం | 290-00 |
| 53. | కులార్ణవ తంత్రమ్ | 150-00 |
| 54. | ఆచార్య సిద్ధ నాగార్జునతంత్రం (ఒరిజనల్) | 390-00 |
| 55. | సిద్ధమూలిక రహస్యం (మంత్ర,యంత్రసహితం) | 63-00 |

## 7. గ్రంథాలు - ఆరాధనలు

| | | |
|---|---|---|
| 1. | భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 54-00 |
| 2. | భగవద్గీత (వచనం) | 99-00 |
| 3. | భగవద్గీత శ్లోకతాత్పర్యం-కేసుబైండింగ్ | 72-00 |
| 2. | గణేశ ఆరాధన 1 | 99-00 |
| 3. | గణేశోపాసన 2 | 99-00 |
| 4. | నవగ్రహవైభవం | 99-00 |
| 5. | నవగ్రహ రెమెడీస్ | 99-00 |
| 6. | నవగ్రహ వేదం | 99-00 |
| 7. | శనిగ్రహారాధన | 99-00 |
| 8. | ఆదిత్యారాధన | 99-00 |
| 9. | సుబ్రహ్మణ్యారాధన | 99-00 |
| 10. | శ్రీ శివ ఆరాధన | 99-00 |
| 11. | లక్ష్మీ ఆరాధన | 99-00 |
| 12. | హనుమదారాధన | 99-00 |
| 13. | లలితారాధన | 99-00 |
| 14. | శ్రీ చక్రారాధన | 99-00 |
| 15. | గాయత్రీ ఆరాధన | 99-00 |

| | | |
|---|---|---|
| 16. | వీరభద్రారాధన | 99-00 |
| 17. | కుజగ్రహారాధన | 99-00 |
| 18. | భైరవారాధన | 99-00 |
| 19. | దైవారాధన | 99-00 |
| 20. | గీతారాధన (భగవద్గీత శ్లోకతాత్పర్యసహిత) | 99-00 |
| 21. | శ్రీవేంకటేశ్వరాధన | 99-00 |
| 22. | హయగ్రీవారాధన | 99-00 |
| 23. | లక్ష్మీనరసింహారాధన | 99-00 |
| 24. | శ్రీ బాలాత్రిపురసుందరీ స్తోత్ర కదంబం | 99-00 |
| 25. | దేవీ లీలామృతం | 99-00 |
| 26. | పురాణపండ సుందరకాండ వచనం | 99-00 |
| 27. | పురాణపండ రామాయణం | 99-00 |
| 28. | పురాణపండ భారతం | 99-00 |
| 29. | పురాణపండ భాగవతం | 99-00 |
| 30. | (సూరి) వాల్మీకి రామాయణం | 99-00 |
| 31. | కాలసర్ప యోగం | 99-00 |
| 32. | నిత్య జీవితములో రుద్రాక్షలు | 99-00 |
| 33. | నిత్య జీవితములో నవరత్నాలు | 99-00 |
| 34. | వేదసూక్తములు | 99-00 |
| 35. | వేమన పద్యసారామృతం | 99-00 |
| 36. | పండగలు పర్వదినాలు | 99-00 |
| 37. | సూక్తిరత్నాలు | 99-00 |
| 38. | హనుమచ్చరిత్ర | 99-00 |
| 39. | నవగ్రహ దర్శనమ్ | 99-00 |
| 40. | నిత్యజీవితంలో నవగ్రహాలు | 99-00 |
| 41. | సాలగ్రామములు | 99-00 |
| 42. | గురుశుక్ర ప్రభావము చంద్రకళానాడీ | 99-00 |
| 43. | శనిగ్రహరెమిడీస్ | 99-00 |
| 44. | జాతకసుధాసారము-జాతకమోక్షప్రదాయిని | 99-00 |
| 45. | వివాహజ్యోతిషమంజరి-మ్యారేజ్‌మ్యాచింగ్‌గైడ్ (సాయిగణపతిరెడ్డి) | 99-00 |
| 46. | మీపుట్టినతేదీనిబట్టి మీజీవితరహస్యాలు (న్యూమరాలజీ లైఫ్‌గైడ్) ,, | 99-00 |
| 47. | మీఅదృష్టానికి (పేరు) నేమ్‌కరక్షన్ ,, | 99-00 |
| 48. | న్యూమరాలజీ రెమిడీస్ | 99-00 |
| 49. | మూకపంచశతీ | 99-00 |
| 50. | శ్రీరామకర్ణామృతం | 99-00 |

| | | |
|---|---|---|
| 51. | రహస్యకుక్కుటశాస్త్రం | 300-00 |
| 52. | ఉపాసన విధానం | 99-00 |
| 53. | పంచమవేదం మహాభారతం | 99-00 |
| 54. | దేవుళ్ళు డాట్ కామ్ | 99-00 |
| 55. | గణపతిభాష్యం | 99-00 |
| 56. | యజుర్వేద ఉపనయనవివాహప్రయోగమంజరి | 99-00 |
| 57. | నవయోగులు | 99-00 |
| 58. | ఆంధ్రప్రదేశ్‌లోనిదర్శించవలసిన ప్రముఖదర్గాలు | 99-00 |
| 59. | సకలదేవతాఅష్టోత్తరాలు(పెద్దది)-(180అష్టోత్తరశతనామావళులతో) | 99-00 |
| 60. | సకలదేవతా అష్టోత్తరశతనామావళులు (కేస్‌బైండింగ్) | 216-00 |
| 61. | సకలదేవతా సహస్రనామములు | 99-00 |
| 62. | ఆధ్యాత్మిక సూక్తి నిధి | 99-00 |
| 63. | బ్రాహ్మణులు గోత్రాలు,ప్రవరలు | 99-00 |
| 64. | సర్వదేవతాస్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు | 99-00 |
| 65. | శ్రీ లక్ష్మీసన్నిధి | 99-00 |
| 66. | శ్రీలక్ష్మీగణపతి హోమకల్పం | 99-00 |
| 67. | మార్షల్ఆర్ట్ స (కరాటే,కుంగ్‌ఫూనేర్చుకోండి) | 99-00 |
| 68. | మ్యాజిక్‌గైడ్ | 99-00 |
| 69. | చదరంగం | 99-00 |
| 70. | పంచముఖ హనుమత్ వైభవం | 63-00 |
| 71. | గరుడపురాణం | 40-00 |
| 72. | మాఘపురాణం | 36-00 |
| 73. | శివపురాణం | 36-00 |
| 74. | వైశాఖపురాణం | 36-00 |
| 75. | కార్తీక పురాణం | 36-00 |
| 76. | కార్తీక పురాణం (చిన్నది) | 25-00 |
| 77. | సర్వకార్యసిద్ధికి రామాయణపారాయణ | 63-00 |
| 78. | పెద్దబాలశిక్ష | 50-00 |
| 79. | గాయత్రీ మహిమ | 36-00 |
| 80. | వృక్షదేవతలు | 63-00 |
| 81. | యాజుష స్మార్త సంస్కార చంద్రిక | 200-00 |
| 82. | సనాతనవైదిక బ్రాహ్మణస్మార్తాగమకల్పమ్ | 150-00 |
| 83. | చతుర్వేదములు | 120-00 |
| 84. | నవగ్రహారాధన | 120-00 |
| 85. | తాళపత్ర సమాహార గోపురం | 120-00 |
| 86. | మనుధర్మ శాస్త్రం (వచనంలో...) (కేస్‌బైండు) | 250-00 |

| | | | |
|---|---|---|---|
| 87. | మానవధర్మములు | | 120-00 |
| 88. | వేదమంత్ర సంహిత | | 120-00 |
| 89. | సహస్రలింగార్చన | | 120-00 |
| 90. | శ్రీ శివగీత | | 120-00 |
| 91. | ద్వాదశఉపనిషత్తులు | | 120-00 |
| 92. | పురాణపండవారి సౌందర్యలహరి | (కేస్‌బైండ్) | 250-00 |
| | (శ్లోకతాత్పర్యసహిత విపులవ్యాఖ్యతో) | సాదా | 120-00 |
| 93. | బృహత్ శివ స్తోత్ర రత్నాకరము | | 200-00 |
| 94. | బృహత్ దేవీ స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 95. | బృహత్ విష్ణు స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 96. | కేదారనాథ్ బదరీనాథ్ యాత్రాగైడు | | 63-00 |
| 97. | దక్షిణావృత శంఖములు | | 63-00 |
| 98. | 108 దివ్యదేశాల విష్ణుక్షేత్రదర్శని | | 36-00 |
| 99. | ధర్మసింధువు(కేస్‌బైండింగ్) | | 270-00 |
| 100. | భారతీయ శైవక్షేత్రయాత్రాదర్శిని | | 99-00 |
| 101. | చిలుకూరి బాలాజీచరిత్ర | | 36-00 |
| 102. | భగవత్‌స్తుతి | | 63-00 |
| 103. | సూర్యోపాసన | | 36-00 |
| 104. | కాశీఖండం | | 250-00 |
| 105. | దేవీభాగవతం | | 360-00 |
| 106. | శ్రీ ఆంజనేయం | | 216-00 |
| 107. | ధర్మసందేహాలు | | 216-00 |
| 108. | ఆధ్యాత్మిక దైవిక వస్తువులు | | 250-00 |
| 109. | రామాయణం | | 600-00 |
| 110. | పోతన భాగవతం | | 900-00 |
| 111. | శివమంత్రములు | | 63-00 |

## 8. వైద్య గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | ఆహారం ఆరోగ్యం | 36-00 |
| 2. | మూలికావైద్య చిట్కాలు | 36-00 |
| 3. | ఆయుర్వేద వైద్య చిట్కాలు | 30-00 |
| 4. | గృహవైద్య రహస్యాలు | 36-00 |
| 5. | గృహవైద్యసారం | 36-00 |
| 6. | హోమియోవైద్యం (ద్వాదశలవణచికిత్స) | 63-00 |
| 7. | ప్రకృతివైద్యం | 36-00 |
| 8. | ఆహారం-వైద్యం | 99-00 |

| | | |
|---|---|---|
| 9. | సంపూర్ణ ఆయుర్వేద-చిట్కా వైద్యం | 99-00 |
| 10. | ఆయుర్వేదమ్ | 36-00 |
| 11. | ఆయుర్వేద మూలికావైద్యదీపిక | 99-00 |
| 12. | దుంపకూరలు, ఆకుకూరలు, కాయగూరలు (వాడకం - ఉపయోగాలు) | 99-00 |
| 13. | ఏకమూలికావైద్యం | 99-00 |
| 14. | అష్టాంగ హృదయం (4భాగాలు) | 1200-00 |
| 15. | రహస్యసిద్ధయోగవైద్యసారమ్ | 99-00 |
| 16. | ప్రాథమిక హోమియోవైద్యం | 99-00 |
| 17. | ఒబెసిటి | 99-00 |
| 18. | హెల్త్‌గైడ్ | 99-00 |
| 19. | ఆయుర్వేదం-జీవనవేదం | 99-00 |
| 20. | ఫుడ్‌థెరపి | 63-00 |
| 21. | న్యాచురల్‌థెరపి | 99-00 |
| 22. | సంపూర్ణఆరోగ్యానికి 20ని॥ | 63-00 |
| 23. | కీళ్ళనొప్పులు మీ సమస్యలైతే... | 99-00 |
| 24. | యోగామంత్ర | 63-00 |
| 25. | యోగా మండే టు సండే | 63-00 |
| 26. | హెర్బల్ మెడిసిన్-హెల్త్‌టుడే | 99-00 |
| 27. | హెల్త్‌ఫైల్ | 108-00 |
| 28. | వస్తుగుణపాఠం | 250-00 |
| 29. | రసాయన వాజీకరణ తంత్రం | 150-00 |
| 30. | వస్తుగుణ మకరందం | 400-00 |
| 31. | నాటువైద్యం -(కేస్‌బైండ్) | 360-00 |
| 32. | నాటువైద్యం (చిన్నది) | 99-00 |
| 33. | ప్రాణాయామము-యోగ | 63-00 |

## 9. అయ్యప్ప - భవానీ రకాలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ అయ్యప్ప లీలామృతం | 30-00 |
| 2. | శ్రీ అయ్యప్ప భజనపాటలు | 63-00 |
| 3. | శ్రీ అయ్యప్ప పూజాకల్పం | 20-00 |
| 4. | శ్రీ అయ్యప్ప భక్తి గీతాలు | 20-00 |
| 5. | హారతిగైకొనుమా | 40-00 |
| 6. | శ్రీ అయ్యప్ప దీక్ష F | 10-00 |
| 7. | శ్రీ అయ్యప్ప భజనమాల F | 10-00 |
| 8. | శ్రీ అయ్యప్ప నిత్యపూజ P | 10-00 |

| | | |
|---|---|---|
| 9. | శ్రీ అయ్యప్ప నిత్యనియమావళి P | 10-00 |
| 10. | భవానీదీక్ష (శ్రీ భవానీ లీలామృతం) | 36-00 |
| 11. | దేవీలీలామృతం | 99-00 |
| 12. | శ్రీ దేవీ పూజాకల్పం | 20-00 |
| 13. | దేవీ భక్తిగీతాలు | 20-00 |
| 14. | భవానీదీక్ష P | 10-00 |
| 15. | దేవీ భక్తిమాల F | 10-00 |
| 16. | శ్రీ అయ్యప్ప భజనావళి | 120-00 |
| 17. | అయ్యప్పపూజావిధి (జేసుదాసుసాంగ్స్‌తో) | 24-00 |

## 10. భజనలు - కీర్తనలు

| | | |
|---|---|---|
| 1. | అన్నమయ్య కీర్తనలు | 20-00 |
| 2. | శ్రీరామదాసు కీర్తనలు | 20-00 |
| 3. | సర్వదేవతా మంగళహారతులు | 20-00 |
| 4. | వసుంధర మంగళ హారతులు | 25-00 |
| 5. | సౌభాగ్య దేవతా మంగళహారతులు | 36-00 |
| 6. | సర్వదేవతా భజనలు | 36-00 |
| 7. | చిట్టి పొట్టి పాటలు | 10-00 |
| 8. | జాతీయ గీతాలు | 10-00 |
| 9. | దేశభక్తి గీతాలు | 36-00 |
| 10. | పండుగలు-పుణ్యక్షేత్రాలు భక్తిగీతాలు | 36-00 |
| 11. | గొబ్బిళ్ళపాటలు,లాలిపాటలు,కోలాటపాటలు | 36-00 |
| 12. | అన్నమయ్య సంకీర్తనలు | 99-00 |
| 13. | పెళ్ళిపాటలు-స్త్రీలపాటలు | 36-00 |
| 14. | భక్తానంద భజనకీర్తనలు(ఓల్డ్‌సినీస్టైల్) | 36-00 |
| 15. | సర్వదేవతాభక్తిమణిమాల | 36-00 |
| 16. | బతుకమ్మ ఉయ్యాల పాటలు | 36-00 |
| 17. | అన్నమయ్య సంకీర్తనానిధి(1000కీర్తనలు) | 270-00 |

## 11. హిట్స్ సాంగ్స్

| | | |
|---|---|---|
| 1. | ఘంటసాల భక్తిగీతాలు-భగవద్గీత | 36-00 |
| 2. | ఎస్.పి.బాలు భక్తిగీతాలు | 36-00 |
| 3. | ఘంటసాల సుమధురగీతాలు | 99-00 |
| 4. | పి. సుశీల సుమధురగీతాలు | 99-00 |

| | | |
|---|---|---|
| 5. | ఎస్.పి. బాలు సుమధురగీతాలు | 99-00 |
| 6. | ఎస్.జానకి సుమధురగీతాలు | 99-00 |
| 7. | వేటూరి సుందరరామమూర్తిహిట్స్ | 99-00 |
| 8. | సర్వదేవతా సినీభక్తిగీతాలు | 99-00 |

## 12. స్త్రీలకు ఉపయుక్త పుస్తకములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీకాంతామణి వంటలు (వెజ్) | 63-00 |
| 2. | శ్రీకాంతామణి వంటలు (నాన్‌వెజ్) | 63-00 |
| 3. | శాకాహార వంటలు | 30-00 |
| 4. | మాంసాహారవంటలు | 30-00 |
| 5. | చిట్టిచిట్కాలు | 30-00 |
| 6. | అందానికి చిట్కాలు | 30-00 |
| 7. | పిల్లల పేర్లు (పెద్దది) | 30-00 |
| 8. | పిల్లల పేర్లు (చిన్నది) | 10-00 |
| 9. | లేటెస్ట్ ఎంబ్రాయిడరీ శాలీబోర్డర్స్ | 36-00 |
| 10. | లేటెస్ట్ ఎంబ్రాయిడరీ డిజైన్స్ | 36-00 |
| 11. | చిన్నారులకు చిరుతిళ్ళు | 30-00 |
| 12. | పసందైన ఫాస్ట్‌ఫుడ్ వంటలు | 30-00 |
| 13. | పలావ్‌లు, ఫ్రైడ్ రైస్‌లు, వెరైటీరైస్‌లు | 30-00 |
| 14. | వేపుళ్ళు-ఇగుర్లు | 30-00 |
| 15. | బ్రేక్‌ఫాస్ట్ వంటలు | 30-00 |
| 16. | పండుగలలో చేసుకొనే పిండివంటలు | 30-00 |
| 17. | మైక్రోవోవెన్ వంటలు | 99-00 |
| 18. | సర్వదేవతాభక్తిమాల | 36-00 |
| 19. | పిల్లలపేర్లు (బాబు) | 36-00 |
| 20. | పిల్లలపేర్లు (పాప) | 36-00 |
| 21. | మోడ్రన్ మెహందీ (గోరింటాకు డిజైన్స్) | 36-00 |
| 22. | మోడ్రన్ పిల్లలపేర్లు | 99-00 |
| 23. | నోరూరించే నాన్‌వెజ్‌వంటలు | 99-00 |
| 24. | మోడ్రన్ టైలరింగ్ (లేడీస్ & జంట్స్) | 99-00 |

## వివిధ రకాలు

| | |
|---|---|
| ఎందరోమహానుభావులు | 270-00 |
| యోగాసనాలు | 36-00 |
| సూర్యనమస్కారములు | 36-00 |
| పొడుపు కథలు (చిన్నవి) | 10-00 |

| | |
|---|---|
| హిందీ-తెలుగు-స్వబోధిని | 20-00 |
| ఇంగ్లీషు-తెలుగు-స్వబోధిని | 20-00 |
| జనరల్ నాలెడ్జ్ | 20-00 |
| నూరు ఎక్కాలు | 10-00 |
| 1-100 టేబుల్ బుక్ | 10-00 |
| 1-100 టేబుల్‌బుక్ (క్రౌన్‌సైజు) | 4-50 |
| శ్రీరామకోటి | 27-00 |
| శ్రీశివకోటి | 27-00 |
| మేజిక్ | 30-00 |
| అంకెలతో గారడీ | 30-00 |
| హృదయస్పందన (కవితలు) | 30-00 |
| వాత్స్యయన కామసూత్రాలు | 36-00 |
| ఎ.పి.టూరిస్ట్ గైడు | 36-00 |
| ఇంద్రజాల రహస్యాలు | 30-00 |
| మహేంద్రజాల రహస్యాలు | 30-00 |
| శరీరభాష (బాడీ లాంగ్వేజ్) | 99-00 |
| క్రియాయోగం | 36-00 |
| ఆనందంగా జీవిద్దాం | 99-00 |
| హరిశ్చంద్ర నాటకం | 50-00 |
| వాత్సాయనకామసూత్రాలు | 99-00 |
| పంచసాయకం | 99-00 |
| రతిరహస్యాలు | 99-00 |
| అనంగరంగం (కంభంపాటి స్వయంప్రకాష్) | 99-00 |
| శృంగారకేళి (కంభంపాటి స్వయంప్రకాష్) | 99-00 |
| గాయత్రీవిజ్ఞాన్ | 99-00 |
| చింతామణి (నాటకం) | 50-00 |
| బాలనాగమ్మ | 50-00 |
| కాళహస్తి స్త్రీల వ్రతకథలు | 36-00 |
| కాళహస్తి రామాంజనేయ యుద్ధం(బదిరెడ్డి) | 50-00 |
| కాళహస్తి గోవింద నామాల భగవద్గీత | 36-00 |
| కాళహస్తి గృహవాస్తు చింతామణి | 99-00 |
| కాళహస్తి గృహవాస్తు మర్మాలు (బైండు) | 63-00 |
| రామరాయవాస్తుశాస్త్రం(ముద్రగడరామారావు) | 90-00 |
| ఎం.ఎస్.ఆర్.హనుమాన్‌చాలీసా | 10-00 |
| ఎం.ఎస్.ఆర్.సుందరకాండ | 80-00 |
| బ్రహ్మంగారిజీవితచరిత్ర (జవంగుల) | 125-00 |
| శ్రీ ఆదిశంకరాచార్య దివ్యచరితామృతం | 40-00 |

| | | |
|---|---|---|
| కాశీరామేశ్వర మజిలీ కథలు | | 63-00 |
| శ్రీలలితాసహస్రనామము(భాస్కరభాష్యం) | | 600-00 |
| ప్రకృతిసిద్ధాంతములు-వేదవిజ్ఞానము-ఫలితజాతక సూత్రములు | | 595-00 |
| ముదుండి విశ్వనాథరాజుగారి గ్రంథములు | | |
| విశ్వకర్మ ప్రకాశము | | 80-00 |
| ప్రాచీనవాస్తుశాస్త్రాలు-ఆధునికవాస్తుపరిశీలన | ,, | 250-00 |
| నారద సంహిత | ,, | 150-00 |
| వాస్తురాజవల్లభము-మూలానువాదము | ,, | 60-00 |
| మయమతము - వచనము | ,, | 80-00 |
| బృహత్సంహిత - వచనము | ,, | 160-00 |
| వాస్తువిజ్ఞానజ్యోతి | | ...... |
| పురోహిత దర్శని (గోరసవీరభద్రాచార్య) | | .... |
| విశ్వకర్మవాస్తువిద్యారహస్యములు | ,, | .... |
| వాస్తు విజ్ఞాన చంద్రిక | ,, | .... |
| మహాదశా పారిజాతం | ,, | .... |
| వాస్తు నారాయణీయం | ,, | 120-00 |
| యోగావళీఖండం | ,, | 120-00 |
| ముహూర్తసింధువు | | 150-00 |
| సర్వార్థచంద్రిక (4భాగాలు) | | 1208-00 |
| మీరే న్యూమరాలజిస్ట్ (దావూద్) | | 370-00 |
| నిర్ణయసింధు (2భాగాలు) | | 590-00 |
| సాయి... | ,, | 45-00 |
| శ్రీ దుర్గానందలహరి | ,, | 200-00 |
| ఆరతిసాయిబాబా | ,, | 11-00 |
| ప్రతిష్ఠకల్పః(సాగి నరసింహమూర్తి) | | 500-00 |
| తాజుద్దీన్‌బాబా సచ్చరిత్ర | | 100-00 |

**సుమారు 100 సం॥రాలునాటి ప్రాచీన ప్రతులు తిరిగి ఈ క్రింది గ్రంథములు ప్రచురించబడినవి.**

| | |
|---|---|
| శ్రీరామ మంత్రానుష్ఠానము | 300-00 |
| శ్రీరామనవరాత్రోత్సవకల్పః | 300-00 |
| సీతారామ కథా సుధ అయోధ్యకాండ | 200-00 |
| సీతారామ కథా సుధ బాలకాండ | 150-00 |
| అరణ్యకాండ | 100-00 |
| శ్రాద్ధము ఎందుకు పెట్టాలి ? షోడశ సంస్కారములు | 200-00 |
| స్మార్త కాపర్ది కారికలు | 200-00 |
| నపుంసక సంజీవనము, వైద్య శిరోమణి | 200-00 |
| విషవైద్య చింతామణి | 200-00 |

| | |
|---|---|
| హేమాద్రి సూరిణా ప్రాయశ్చిత్తాధ్యాయః | 300-00 |
| సర్వమూలికా గుణరత్నాకరం | 300-00 |
| ఆపస్థంబీయ ధర్మసూత్రాలు | 300-00 |
| సర్వశాంతి దర్పణం - అపర ప్రయోగ దర్పణం | 200-00 |
| గణకరంజని | 200-00 |
| సంతాన దీపిక | 200-00 |
| తిథినిర్ణయ కాణ్డః | 250-00 |
| ముహూర్త దర్పణం | 200-00 |
| జ్యోతిష శాస్త్ర రత్నము (శ్రీపతిజాతక పద్ధతి) | 250-00 |
| లఘుతాచకము | 200-00 |
| శ్రీ వైఖనస పైతృమేదిక ప్రయోగః | 300-00 |
| స్మృతి రత్నాకరము (ధర్మశాస్త్రం) | 400-00 |
| జాతకామృతతసారం | 300-00 |
| జాతక బోధిని | 300-00 |
| సంగీత విద్యాదర్పణం | 300-00 |
| సంగీత సర్వార్థసారసంగ్రహం | 300-00 |
| ముహూర్త మార్తాండం(టీకతాత్పర్యం) | 450-00 |
| జాతకరహస్యం | 200-00 |
| రాజమార్తాండం | 200-00 |
| ఆయుర్దాయదీపిక | 200-00 |
| వైద్యామృతం | 200-00 |
| అనుపానమంజరీ | 200-00 |
| నవగ్రహశాంతి విధానం-ఉదకశాంతి విధిః | 200-00 |
| చికిత్సరత్నము | 200-00 |
| స్వరచింతామణి | 200-00 |
| ద్వాదశలోహ భస్మవిధానం | 200-00 |
| దైవజ్ఞయశో విభూషణం | 200-00 |
| అనుపాన రత్నకరము | 200-00 |
| కాలామృతము | 250-00 |
| దైవజ్ఞకర్ణామృతము | 300-00 |
| రసేంద్ర చింతామణి | 300-00 |
| రసరత్న సముచ్చయం | 300-00 |
| వస్తుగుణరత్నాకరము | 300-00 |
| హోరానుభవదర్పణము | 360-00 |
| విశ్వకర్మ ప్రకాశిక వాస్తుశాస్త్రము | 250-00 |
| స్త్రీజన కల్పవల్లి | 450-00 |
| సంగీత సర్వార్థ సంగ్రహం | 300-00 |
| సంగీత సుధాసంగ్రహము | 250-00 |
| అర్క ప్రకాశము | 200-00 |
| సంగీత మార్తాండము | 200-00 |
| సంగీత ప్రథమబోధిని | 200-00 |

| | |
|---|---|
| వైద్యకల్పతరువు | 200-00 |
| రసప్రదీపిక | 250-00 |
| గణకానందము | 250-00 |
| శ్రీ లలితాసహస్రనామావళిః-వివరణాత్మక భావంతో | 200-00 |
| నవచండీ వేదోక్త శ్రీ దేవీ పూజాకల్పం | 200-00 |
| శ్రీ గాయత్రీ అనుష్ఠాన తత్త్వప్రకాశిక | 360-00 |
| సంగీతమార్తాండము | 250-00 |
| సారావళి | 360-00 |
| భేషజకల్పము | 200-00 |
| గురుశిష్య ఆయుర్వేద వైద్యచింతామణి | 360-00 |
| జాతకమణి | 200-00 |
| సర్వశకున ప్రకాశిక | 200-00 |
| యాజుష ప్రయోగ చంద్రిక | 250-00 |
| శిక్షావల్లీ-ఆనందవల్లీ-భృగువల్లీ | 300-00 |
| వసంతరాజ శకునము | 250-00 |
| తొట్టి వైద్యం | 450-00 |
| జ్యోతిష సిద్ధాంత సంగ్రహము (పంచాంగ గణితం) | 300-00 |
| సహస్ర యోగప్రకాశిక | 300-00 |
| శ్రీవిద్యారహస్యం | 290-00 |
| మహర్షుల చరిత్ర 1,3 300+300 | |
| వేంకట సోమయాజీయం అను ధర్మశాస్త్రకాండము | 250-00 |
| శ్రీఆంజనేయం | 216-00 |
| రాశితుల్యవత్సర ఫలితం | 200-00 |
| నాడి జ్యోతిష విశ్లేషణ | 400-00 |
| రహస్యకుక్కుటశస్త్రం | 300-00 |
| స్త్రీ ధర్మరత్న బాండాగారము | 200-00 |
| శైవోత్సవరత్నాకరం | 300-00 |
| యాజుషప్రయోగ చిన్తామణి | 300-00 |
| సుస్వర ఋగ్వేద ప్రయోగదర్శిని | 300-00 |
| ఆయుర్వేద వైద్య సంగ్రహం | 300-00 |
| వశిష్ఠ సంహిత | 360-00 |
| హోమియోపతి గృహవైద్యం | 200-00 |
| వ్రతచూడామణి | 300-00 |
| వైశ్యధర్మప్రకాశిక | 300-00 |
| ఆలయ నిత్యార్చన పద్ధతి | 200-00 |
| స్మృతిముక్తాఫలం | 300-00 |
| ఆపస్థంబయల్లాజీయమ్ | 300-00 |
| జ్యోతిషశాస్త్రసంగ్రహము | 200-00 |
| కర్మవిపాకాఖ్యయం | 360-00 |
| ముహుర్త రత్నావళి | 250-00 |
| సుదివిలోచనం | 300-00 |
| ఉత్తర కాలామృతం | 200-00 |
| సర్వవిషయ సర్వస్వసంగ్రహం | 200-00 |

• హాప్ ఫన్



# వర్షంలా దిగి వచ్చావు

నువ్వు తలుపు తీసి వచ్చినట్టు ఉంది.
ముందు చల్లటి గాలి.
ఆ తర్వాత తీయటి మట్టి వాసన.
ఆ తర్వాత గడప మీద ముత్యాల తుంపర.
కిటికీ రెక్కల చప్పట్లు.
తడి ముద్దులు ముందు నాకే కావాలి అన్నట్లు
బయటికి పరుగెత్తిన బుజ్జిగాడి కేరింతలు.
నాట్యం చేస్తున్న పూలమొక్కలు.
తన్మయత్వంలో ఊగిపోతున్న చెట్లు.
ఈల వేస్తున్న కొమ్మలు.
'అమ్మా..! చూడు వానొస్తోంది' అని చిట్టి చిలకమ్మ తుళ్లింతలు.
'అంబా' అంటూ గుడిలో ఆవు ఆకాశానికి మోరెత్తి వందనాలు.
మసీదులో కాలుపెట్టిన రెహ్మాన్.. టోపీ దులుపుకుంటూ 'అల్లాహో అక్బర్' అని చేసిన అజాన్.
'మే గాడ్ బ్లెస్ యూ' అంటూ చర్చిలో మోగిన గంట.
'కుయ్ కుయ్ కుయ్' అంటూ అంబులెన్స్ తీసే 'డోంట్ వర్రీ' రాగాలు.
'టకటకాటకా' అంటూ డ్వాక్రా చెల్లెమ్మ కుట్టు మిషన్ వేస్తున్న తాళం.
'హర్షం హర్షం హర్షం' అంటూ పొలం గట్టు మీద రైతు బిడ్డ కొలిచే వర్షం.
'తపక్ తపక్ తపక్' అని పెన్షన్ తాతయ్య బట్టతల మీద వాన వాయించే తబలా.
చినుకుల టపటపకు చిన్నారి 'కొత్త' గుండె 'లబ్‌డబ్'ల లయలు.
'పాంయ్ పాంయ్' అంటూ దేవుడయ్య పెద్ద కొడుకు.. పెద్ద చదువు చదివి.. పెద్ద ఉద్యోగం చేస్తూ.. పెద్ద కారులో.. పెద్ద మనసుతో.. బడి పిల్లల్ని ఊరిలోకి తెస్తున్న హడావుడి.
అచ్చం నువ్వు వచ్చినట్టే ఉంది రాజన్నా!
ముందు చల్లటి గాలి.
తర్వాత తీయటి మట్టి వాసన.
తర్వాత మా గుండె వాకిలిపై ముత్యాల్లాంటి జ్ఞాపకాల తుంపర.
ఏ గుండె తట్టినా.. ఈ ఆనందాల జల్లులే!

మీ

రామ్

ఎడిటర్, ఫన్‌డే & ఫ్యామిలీ




వృద్ధులకు
పెన్షన్ల పెంపు

పావలా వడ్డీ
రుణాలు

ఆరోగ్యశ్రీ

రుణ మాఫీ
ఉచిత విద్యుత్

ఇందిరమ్మ
గృహాలు



ఫీజు
రీయింబర్స్‌మెంట్

ఇంకా ఎన్నో ఎన్నెన్నో..

వికలాంగులకు
ఆసరా



'ప్రతిభకు పేదరికం అడ్డు కాకూడదు. పేదింట్లో పుట్టిన ప్రతి ప్రతిభావంతుడు ఉన్నత చదువులు చదవాలి. నా అక్కలూ..చెల్లెళ్లు...తమ్ముళ్ల కళ్లలో వెలుగులు చూసినపుడే నా నిజమైన పుట్టిన రోజు'

# ఏ గుండె తట్టినా...

మనకేదైనా కష్టమొచ్చినప్పుడు, ఇంక ముందుకు కదల్లేం అనుకున్నప్పుడు, నిస్సహాయ స్థితిలో కూరుకుపోయినప్పుడు ఆ దేవుణ్ని వేడుకుంటాం. ఆయనొక్కడే దిక్కని నమ్మేస్తాం.

దేవుడు అన్నిసార్లూ చెయ్యందించలేడు. అలాగని అందించకపోతే ఆయన దేవుడే కాదు.

అందుకే ఆ దేవుడొక నాన్నను పుట్టించాడు, ధైర్యమిస్తాడని. అమ్మను పుట్టించాడు, నమ్మకాన్ని నింపుతుందని. అక్కను, చెల్లిని, అన్నను పుట్టించాడు, తోడుంటారని. ఓ మనిషిని పుట్టించాడు, సాయముంటాడని.

వైఎస్ రాజశేఖరరెడ్డి – కొన్ని కోట్ల హృదయాలకొక 'మనిషి'. ఒక అన్న. ఒక నాన్న. ఒక తోడు. ఒక అండ. ఒక సాయం.

వైఎస్సార్ 68వ జయంతి సందర్భంగా.. 'మా శేఖరుడు' అంటూ ఆయనను గుర్తుచేసుకుంటోన్న 68 కథలివి. ఈ కథల్లో ఆయన ఊపిరి పీల్చుకుంటున్నాడు. ఈ కథల్లో ఆయన గుండెచప్పుడు వినిపిస్తోంది. ఏ కథలోని గుండెను తట్టినా వినిపిస్తోన్న ఒక్క పేరు.. వైఎస్ రాజశేఖరరెడ్డి!!

'మనిషి ఆనందంగా బతకాలంటే ఆరోగ్యంగా ఉండాలి. ఉన్నతంగా బతకాలంటే ఉన్నత చదువులు చదవాలి. పేదవారు కూడా ఆనందంగా బతకాలి. పేదవారు కూడా ఉన్నతంగా బతకాలి' అనేవారు వైఎస్సార్. ఈ ఆలోచనల నుంచి పుట్టినవే ఆరోగ్యశ్రీ, ఫీజు రీయింబర్స్‌మెంట్, ఇవిగాక ఇంకెన్నో పథకాలు. ఈ పథకాలతో మారిన జీవిత చిత్రాలివి...

## ఆయన మా దేవుడు

నిరుపేదలం మేము. మా అమ్మాయి చంద్రనాగసుష్మకు పుట్టుక నుంచి చెవులు వినిపించేవి కావు. మాటలు కూడా రాలేదు. ఎన్నో ఆస్పత్రుల చుట్టూ తిరిగాం. వైఎస్ సార్ ఆరోగ్యశ్రీ పథకం మా పాలిట వరంలా మారింది. ఆరోగ్యశ్రీ కింద ఆపరేషన్ చేస్తామని హైదరాబాద్‌లోని వాసవి ఆస్పత్రి నుంచి ఫోన్ వచ్చింది. హైదరాబాద్ వెళ్లడానికి సిద్ధపడుతుండగా అదే రోజు... 2009 సెప్టెంబర్ 2న హెలికాప్టర్ ప్రమాదంలో మహానేత వైఎస్ మరణించినట్లు వార్తల్లో



కూతురు చంద్రనాగసుష్మతో ధరావత్ నరసింహారావు, నాగమణి దంపతులు

తెలుసుకున్నాం. బాధను తట్టుకోలేకపోయాం. ఏడుస్తూ అందరం ఇంట్లోనే ఉండిపోయాం. వారం తర్వాత హైదరాబాద్ వెళ్లాం. ఆరోగ్యశ్రీ కింద వాసవి ఆస్పత్రి డాక్టర్లు మా అమ్మాయికి ఆపరేషన్ చేశారు. ఆపరేషన్ తర్వాత మా అమ్మాయికి వినికిడి శక్తి వచ్చింది. మాట్లాడటం కూడా ప్రారంభించింది. ఇప్పుడు ఆమె ఆరో తరగతి చదువుకుంటోంది. మా ఇంట్లో దేవుళ్లతో పాటే వైఎస్ గారి ఫొటోకు కూడా రోజూ పూజలు చేస్తుంటాం. ఆయన మా దేవుడు.

– ధరావత్ నరసింహారావు, వెంగన్నపాలెం, జూలూరుపాడు, భద్రాద్రి కొత్తగూడెం

## కష్టాల కడలి నుంచి బయటపడ్డాం

**మా** నాన్న నాగేశ్వరరావు ఇటుక బట్టీల వ్యాపారి వద్ద గుమస్తా. అమ్మ శేషమ్మ మామూలు గృహిణి. నాన్నకు వచ్చే జీతంతో ఇల్లు గడవడమే కష్టంగా ఉండేది. కష్టాలకు ఎదురీదుతూనే నన్ను ఇంటర్ వరకు చదివించారు. పెద్ద చదువులు చదవాలనే కోరిక ఉన్నా తీరే పరిస్థితులు లేవు. అలాంటి పరిస్థితుల్లో ఆనాటి సీఎం వైఎస్ రాజశేఖరరెడ్డి గారు నాలాంటి పేద విద్యార్థులకు ఆశాదీపంలా ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకాన్ని తెచ్చారు. ఫీజు రీయింబర్స్‌మెంట్ వల్ల విజయవాడలోని ఎస్ఆర్‌కేఐటీ కాలేజీలో సివిల్ ఇంజనీరింగ్ పూర్తి చేశా. ఏటా ముప్పయి వేల చొప్పున నాలుగేళ్లకు రూ.1.20 లక్షలు రీయింబర్స్‌మెంట్ కింద వచ్చింది. చదువు పూర్తయ్యాక 2013లో భద్రాచలం పీఆర్ సబ్‌డివిజన్‌లో అసిస్టెంట్ ఇంజనీర్‌గా ఉద్యోగం వచ్చింది. నాకు ఉద్యోగం రావడంతో మా కుటుంబం కష్టాల కడలి నుంచి బయటపడింది. ఫీజు రీయింబర్స్‌మెంట్ లేకుంటే నేను ఈ స్థితికి చేరుకునేవాడిని కాదు.

**- టి. వంశీ, మహబూబ్‌నగర్**

## ఇంజనీర్‌ను కాగలిగా

**మా** నాన్న వెంకటప్పయ్య గీత కార్మికుడు. అమ్మ మల్లమ్మ గృహిణి. నిరుపేద కుటుంబం మాది. నానా తంటాలు పడి నన్ను ఇంటర్ వరకు చదివించారు. ఎంసెట్ రాశాను. బీటెక్‌లో సీటు వచ్చింది. అయితే, పెద్ద చదువులకు ఖర్చు పెట్టలేని పరిస్థితి. అలాంటి పరిస్థితుల్లో మహానేత వైఎస్ రాజశేఖరరెడ్డి గారు ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకమే నన్ను ఆదుకుంది. ఫీజు రీయింబర్స్‌మెంట్‌తో ఇంజనీరింగ్ పూర్తి చేశాను. చదువు పూర్తి కాగానే హైదరాబాద్‌లోని ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీలో ఉద్యోగం వచ్చింది. కొన్నాళ్లకే చెన్నైలోని టెక్ మహీంద్రా కంపెనీలో మంచి అవకాశం వస్తే, అక్కడ చేరాను. ఇప్పుడు అదే కంపెనీలో చేస్తున్నాను. నెలకు రూ.50 వేల వరకు జీతం వస్తోంది. నాకు ఉద్యోగం వచ్చాక మా కుటుంబం కష్టాలన్నీ తీరాయి. వైఎస్ గారి దయ వల్లే నేను ఇంజనీర్ కాగలిగాను.

**- చామకూరి వినోద్‌కుమార్,**
**గొల్లపాడు, ఖమ్మం**



'రాష్ట్రంలో నిరుపేదలెవరూ డబ్బులేని కారణంగా ఉన్నత విద్యకు దూరం కాకూడదు. అందుకే ఫీజుల చెల్లింపు పథకాన్ని చేపట్టాం'





## నా బిడ్డకు ప్రాణభిక్ష పెట్టారు

**మా** చిన్నారి బాబు సుశాంత్‌రామ్‌కు పదహారు నెలల వయసులో జ్వరం వచ్చింది. ఖమ్మంలోని ఒక ఆస్పత్రికి తీసుకు వెళ్లాం. బాబుకు గుండెలో రంధ్రం ఏర్పడిందని డాక్టర్లు చెప్పారు. ఆపరేషన్ చేస్తే తప్ప బతకడన్నారు. ఆరోగ్యశ్రీ పథకం కింద హైదరాబాద్‌లోని కార్పొరేట్ ఆస్పత్రిలో గుండె ఆపరేషన్ చేయించాం. నెల్లాళ్ల పాటు ఆస్పత్రిలోనే చికిత్స చేశారు. ఖర్చులన్నీ ఆరోగ్యశ్రీ పథకం కిందనే చెల్లించారు. ప్రస్తుతం మా బాబు సుశాంత్ రెండో తరగతి చదువుకుంటున్నాడు. ఇదొకటే కాదు, మా పూరిల్లు 2007లో కాలిపోయింది. మనసున్న మారాజు వైఎస్ గారికి గోడు చెప్పుకోవడానికి నేరుగా సీఎం క్యాంపు ఆఫీసుకు వెళ్లాను. ఆయన వెంటనే మూడువేలు ఇచ్చారు. ఇందిరమ్మ ఇల్లు మంజూరు చేశారు. ఇక నా చెల్లెలు సుబ్బలక్ష్మి ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం ఆసరాతో ఎమ్మెస్సీ పూర్తిచేసి, ఇప్పుడు గ్రామీణ ఉపాధి హామీ పథకంలో టెక్నికల్ అసిస్టెంట్‌గా ఉద్యోగం చేస్తోంది. మా ఇంటి దీపాన్ని వెలిగించిన మహానేత వైఎస్ గారికి దేవుళ్లతో పాటు రోజూ దీపం పెట్టుకుంటాం.

**- కొడుకు సుశాంత్‌రామ్, భార్య నందినితో రామకృష్ణ, మాటూరుపేట, మధిర మండలం, ఖమ్మం**

## నా గుండెలో కొలువైన దైవం

**ప**దిహేనేళ్ల వయసులోనే అమ్మా నాన్నలను పోగొట్టుకుని అనాథనయ్యాను. చిన్నా చితకా పనులు చేసుకుంటూ పొట్ట పోసుకునే వాణ్ణి. కొన్నాళ్లకు నచ్చిన అమ్మాయిని పెళ్లి చేసుకున్నాను. ఇద్దరు పిల్లలు. జీవితం సాఫీగా సాగిపోతుండగా 2007 డిసెంబర్‌లో నాకు గుండెజబ్బు వచ్చింది. సరిహద్దుకు దగ్గర్లోని బరంపురం పెద్దాస్పత్రికి వెళ్లి చూపించుకుంటే ఆపరేషన్ చేయాలన్నారు. ఆపరేషన్‌కు కావలసిన డబ్బు లేదు. దిక్కుతోచని స్థితిలో పడ్డాను. నా భార్యాబిడ్డలు కన్నీరు మున్నీరుగా విలపించసాగారు. అంతలోనే ఒక అపరిచితుడు దేవుడిలా తారసపడ్డాడు. 'మీ ముఖ్యమంత్రి ప్రవేశపెట్టిన ఆరోగ్యశ్రీ పథకం కింద ఉచితంగా ఆపరేషన్లు చేస్తారు. ప్రయత్నించండి' అని చెప్పాడాయన. కాస్త ధైర్యం వచ్చింది. తిరిగి ఇచ్ఛాపురానికి చేరుకున్నాను. స్థానిక నేతల సాయంతో ఆరోగ్యశ్రీ కింద విశాఖలోని కేర్ ఆస్పత్రిలో చేరాను. అక్కడ నాకు 2008 జనవరి 2న ఆపరేషన్ చేశారు. పూర్తిగా కోలుకుని ఇంటికొచ్చాను. 2014 ఏప్రిల్ 14న అంబేడ్కర్ జయంతి రోజున జగనన్న నా ఇంటికొచ్చారు. 'తమ్ముడూ! ఎలా ఉంది నీ ఆరోగ్యం... పిల్లలు బాగున్నారా?' అంటూ ఆత్మీయంగా పలకరించినప్పుడు ఉద్వేగాన్ని తట్టుకోలేక కంటతడి పెట్టుకున్నాను. 'తమ్ముడూ... నీ దేవుడు ప్రతి పేదవాడి గుండెల్లోనూ కొలువై ఉంటాడు' అంటూ జగనన్న ఓదార్చారు. ఆ ఓదార్పును ఎప్పటికీ మరువలేను. నా గుండెలో కొలువైన దైవం రాజన్న.



**- నీలాపు వెంకటరెడ్డి, ఇచ్ఛాపురం, శ్రీకాకుళం**

## మా ఇంటి దీపం నిలిపారు





సాయిబాబా

**మా**కు ఇద్దరు అబ్బాయిలు. చిన్నబ్బాయి సాయిబాబా పుట్టినప్పటి నుంచి అనారోగ్యంతో బాధపడేవాడు. ఐదేళ్లు వచ్చేసరికి అనారోగ్యం మరింత ఎక్కువైంది. ప్రింటింగ్ ప్రెస్‌లో పనిచేసే నా జీతం ఇల్లు గడవడానికే చాలేది కాదు. అబ్బాయికి మెరుగైన వైద్యం చేయించే స్థోమత లేదు. తెలిసిన వాళ్ల సాయంతో మా అబ్బాయిని పుట్టపర్తిలోని సత్యసాయి ఆస్పత్రికి తీసుకువెళ్లాను. గుండెలో రంధ్రం ఉందని, ఆపరేషన్ చేయకపోతే బతకడం కష్టమని డాక్టర్లు చెప్పారు. అయితే, ఎన్నాళ్లు ఎదురుచూసినా ఆస్పత్రిలో అడ్మిషన్ ఇవ్వలేదు. ఇక చేసేది లేక బెంగళూరులోని ఒక ఆస్పత్రికి వెళ్లాం. అక్కడి డాక్టర్లు ఆపరేషన్‌కు మూడు లక్షలవుతుందన్నారు. అంత డబ్బు లేకపోవడంతో ఆశలు వదులుకుని పులివెందులకు తిరిగి వచ్చేశాం. చుట్టుపక్కల వారి సలహా మేరకు హైదరాబాద్ వెళ్లి సీఎం క్యాంపు కార్యాలయంలో వైఎస్ రాజశేఖరరెడ్డి గారిని కలుసుకున్నాం. మా గోడు విన్న ఆయన ధైర్యం చెప్పారు. వెంటనే అపోలో ఆస్పత్రికి ఫోన్ చేయించి, మా అబ్బాయిని అక్కడ చేర్పించారు. సీఎం సహాయ నిధి నుంచి ఆపరేషన్ ఖర్చులు ఇప్పించారు. ఆయన దయ వల్లనే మా అబ్బాయి పూర్తిగా కోలుకున్నాడు. మా ఇంటి దీపం నిలిపిన దైవం ఆయన.

**- సావ్‌సేన్‌వల్లి, పులివెందుల, వైఎస్ఆర్ కడప**





'ప్రజల జీవన ప్రమాణాలు ఇంకా మెరుగు పడాలి. అందుకు అధికారులు నిబద్ధత, పారదర్శకత, కార్య దీక్షతో పనిచేయాలి.'

## మా ప్రాణదాత

ఊళ్లో సైకిల్ షాపు నడుపుతూ కుటుంబాన్ని నెట్టుకొస్తున్నా. రెక్కాడితే గాని డొక్కాడని బతుకులు మావి. ఉన్న కష్టాలకు తోడు 2009లో నాకు గుండెజబ్బు వచ్చింది. చేతిలో పైసలు లేని పరిస్థితి. వైఎస్ సార్ తెచ్చిన ఆరోగ్యశ్రీ పథకమే ఆదుకుంది.





వెంకటమ్మ

ఆరోగ్యశ్రీ కార్డుతో ఆపరేషన్ చేయించుకున్నాను. ఆరోగ్యం కుదుటపడింది. ఏదోలా బతుకు వెళ్లదీస్తుంటే దురదృష్టం మళ్లీ వెంటాడింది. నా భార్య వెంకటమ్మకు క్యాన్సర్ సోకింది. ఆపరేషన్ చేయక తప్పదని డాక్టర్లు చెప్పారు. ఆరోగ్యశ్రీ పథకం ద్వారానే ఆమెకు కూడా ఆపరేషన్ చేయించాను. ఆపరేషన్ తర్వాత ఆమె పూర్తిగా కోలుకుంది. మా ఇద్దరి ప్రాణాలూ నిలిచాయంటే అదంతా మా దేవుడు వైఎస్ సార్ చలవే! ఆయన మా ప్రాణదాత.

**- పొదిల పుల్లయ్య, తల్లాడ, ఖమ్మం**

## ఆరోగ్యశ్రీ మా ప్రాణాలను కాపాడింది



మాకు ముగ్గురు ఆడపిల్లలు. మామూలు మధ్య తరగతి కుటుంబం మాది. పనీపాటా చేసుకుంటూ కుటుంబాన్ని పోషించుకునేవాడిని. ఉన్నట్టుండి నాకు గుండెజబ్బు వచ్చింది. ఆపరేషన్ తప్పదన్నారు డాక్టర్లు. అప్పుడే వైఎస్ రాజశేఖరరెడ్డి గారు ఆరోగ్యశ్రీ పథకాన్ని ప్రవేశపెట్టారు. ఆరోగ్యశ్రీ పథకం కింద ఆపరేషన్ చేయించుకున్నా. ఒకవైపు నేను కోలుకుంటుండగా మరోవైపు నా భార్య వరలక్ష్మికి కిడ్నీ సమస్య వచ్చింది. ఆమెను కూడా ఆరోగ్యశ్రీ పథకమే ఆదుకుంది. ఆమెకు కూడా ఆరోగ్యశ్రీ కింద ఉచితంగా ఆపరేషన్ చేశారు. ఆరోగ్యశ్రీ పథకమే లేకుంటే మా ప్రాణాలు గాల్లో కలిసిపోయేవి. మా పిల్లలు అనాథలయ్యేవారు. జగన్ గారు, షర్మిల గారు ఈ ప్రాంతాలకు వచ్చినప్పుడు వారికి ఈ విషయాన్నే చెప్పాను. వైఎస్ రాజశేఖరరెడ్డి గారు కలలుగన్న సంక్షేమ రాజ్యం తిరిగి రావాలి.

**- అడబాల కృష్ణారావు, మెట్టవలస, బొబ్బిలి మండలం, విజయనగరం**

## జీవితంలో నిలదొక్కుకున్నా



మాది నిరుపేద వ్యవసాయ కుటుంబం. రెక్కాడితే గాని డొక్కాడని బతుకులు మావి. మా అమ్మ నాన్నలు నానా కష్టాలకోర్చి నన్ను పదో తరగతి వరకు చదివించారు. పదో తరగతి పూర్తయ్యాక ఇక చదివించలేమని చేతులెత్తేశారు. నేను కూడా చదువు మానేసి పొలం పనులు చేస్తూ అమ్మా నాన్నలకు చేదోడుగా ఉందామనుకున్నాను. ఆ సమయంలోనే ముఖ్యమంత్రిగా ఉన్న వైఎస్ రాజశేఖరరెడ్డి గారు ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకాన్ని ప్రవేశపెట్టారు. ఫీజు రీయింబర్స్‌మెంట్ ఆసరాతో ఇంటర్‌లో చేరాను. తర్వాత డిగ్రీ కూడా పూర్తి చేశాను. డిగ్రీ తర్వాత ఆర్పీఎఫ్‌లో ఉద్యోగం వచ్చింది. ప్రస్తుతం విజయవాడలో ఆర్పీఎఫ్ కానిస్టేబుల్‌గా పని చేస్తున్నాను. ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం వల్లనే జీవితంలో నిలదొక్కుకున్నా. ఆ పథకమే లేకుంటే మట్టిపనుల్లో మగ్గిపోయేవాణ్ణి. ఇదంతా వైఎస్ సార్ చలవే. ఆయనను ఎన్నటికీ మరువలేను.

**- రెడ్డి దామోదరరావు, ఒమ్మి గ్రామం, నెల్లిమర్ల మండలం, విజయనగరం జిల్లా**

## ఊపిరి ఉన్నంత వరకు మరువలేను



నేను పెయింటింగ్ పని చేసుకొనే రోజు కూలీని. నా భార్య కూడా ఇళ్లల్లో పనులు చేసేది. ఇద్దరి ఆదాయంతో బొటాబొటిగా ఇల్లు గడిచేది. రోజులిలా గడుస్తుంటే 2008 ఆగస్టులో నాకు గుండెనొప్పి వచ్చింది. తమిళనాడులోని ఒక ప్రైవేటు ఆస్పత్రికి వెళితే ఆపరేషన్ చేయాలన్నారు. ఐదులక్షల ఖర్చు అవుతుందన్నారు. దిక్కుతోచని పరిస్థితిలో మహానుభావుడు వైఎస్ సార్ తెచ్చిన ఆరోగ్యశ్రీ గురించే మరచిపోయాం. తెలిసిన వాళ్ల సలహాతో ఆరోగ్యశ్రీ కార్డు తీసుకుని తిరుపతిలోని స్విమ్స్‌కు వెళ్లాం. అక్కడ ఉచితంగా ఆపరేషన్ చేశారు. పదిహేను రోజులు అక్కడే ఉంచి పూర్తిగా కోలుకునే వరకు చికిత్స చేశారు. డిశ్చార్జి చేసి ఇంటికి పంపేటప్పుడు బస్సు చార్జీలు కూడా ఇచ్చారు. ఇప్పుడు ఆరోగ్యంగా ఉన్నా. అన్ని పనులూ చేసుకోగలుగుతున్నా. ఇదంతా వైఎస్ గారి చలవే. ఊపిరి ఉన్నంత వరకు ఆయనను మరువలేను.

**- తిమోతి, చిత్తూరు**

## ఆ దేవుడు ఇచ్చిన వరం

**మా**ది నిరుపేద వ్యవసాయ కుటుంబం. అమ్మానాన్నలు కష్టపడి నన్ను డిగ్రీ వరకు చదివించారు. పై చదువులకు ఇక స్థోమత లేదని చేతులెత్తేశారు. ఇంతలో వైఎస్ రాజశేఖరరెడ్డి గారు దేవుడిలా ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకాన్ని ప్రవేశపెట్టారు. మా అమ్మా నాన్నలకు ఈ సంగతి వివరించి, పై చదువులకు పూనుకున్నాను. 2008లో ఎంబీఏలో చేరాను. ప్రస్తుతం ఒక మల్టీనేషనల్ కంపెనీలో పనిచేస్తున్నాను. నెలకు రూ.50 వేల వరకు జీతం వస్తోంది. నాతో పాటు నా చెల్లెలు, నా భార్య కూడా ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం ఆసరాతోనే ఉన్నత చదువులు చదువుకున్నారు. ఫీజు రీయింబర్స్‌మెంట్ ఇచ్చిన అభయంతో మా కుటుంబం ఆర్థికంగా నిలదొక్కుకుంది. ఇదంతా ఆ దేవుడు వైఎస్ గారు ఇచ్చిన వరమే. ఆయనకు ఎప్పటికీ రుణపడి ఉంటాం.



**- పూజారి భాస్కర్, గొల్లపల్లి, చిత్తూరు**

## పెద్దాయన పుణ్యమే

**మా**ది మామూలు మధ్యతరగతి కుటుంబం. ఈరోజు నేను ఎంటెక్ చేశానంటే ఇదంతా ఆ పెద్దాయన వైఎస్ రాజశేఖరరెడ్డిగారి పుణ్యమే. ఫీజు రీయింబర్స్‌మెంట్‌తో బీటెక్ పూర్తి చేశాను. ముస్లింలకు 4 శాతం రిజర్వేషన్ కల్పించడం వల్ల యోగి వేమన యూనివర్సిటీలో సీటు వచ్చింది. ఎంటెక్ పూర్తి చేసి బెంగళూరులో కోచింగ్ తీసుకున్నాను. ఇప్పుడు ఉద్యోగం కూడా వచ్చింది. ముస్లింలకు 4 శాతం రిజర్వేషన్ లేకుంటే ఎంటెక్ చేయడం నాకు సాధ్యమయ్యేది కాదు. నాలాంటి విద్యార్థులంతా పెద్దాయన మేలును ఎప్పటికీ మరువలేం.



**- రూఫియా, కడప**





## ఆయన దయవల్లే ఇప్పుడిలా ఉన్నా



పదేళ్ల కిందట నా ఆరోగ్యం పూర్తిగా దెబ్బతింది. వెన్నుపూసకు రక్తప్రసరణ నిలిచిపోయింది. నరాలు చచ్చుబడి కదల్లేని స్థితిలో మంచానపడ్డాను. వైద్యం చేయించుకోవడానికి చేతిలో చిల్లిగవ్వలేదు. నా భార్య ధనలక్ష్మి నా పరిస్థితి చూసి తల్లడిల్లిపోయేది. మా అబ్బాయి సునీల్, అమ్మాయి దుర్గాభవాని.. నేను మంచానపడ్డ నాటికి వాళ్లిద్దరూ చాలా చిన్నపిల్లలు. ఆరునెలలు అలాగే గడిచాయి. జీవితంలో తిరిగి మామూలు మనిషిని కాగలనా లేదా అని సతమతమయ్యేవాడిని. నా కుటుంబం పరిస్థితి ఏమిటని దేవుడిని తల్చుకుంటూ ఏడ్చేవాడిని. అలాంటి సమయంలోనే వైఎస్ రాజశేఖరరెడ్డిగారు ముఖ్యమంత్రి పదవిలోకి వచ్చారు. మాలాంటి పేదల కోసం ఆరోగ్యశ్రీ పథకాన్ని ప్రవేశపెట్టారు. ఆరోగ్యశ్రీ కార్డుతో హైదరాబాద్‌లోని నిమ్స్‌లో చేరాను. అక్కడ ఆపరేషన్ చేశారు. మరో ఆరునెలలు ఆస్పత్రిలోనే ఉంచి చికిత్స చేశారు. పూర్తిగా కోలుకున్న తర్వాత డిశ్చార్జి చేశారు. ఆనాడు వైఎస్ గారు పెట్టిన భిక్షతోనే నేను ఇప్పుడిలా నా భార్యాపిల్లలతో సంతోషంగా ఉన్నా. బతికి ఉన్నంత కాలం ఆయనను పూజించుకుంటూనే ఉంటాం.

**- కుటుంబ సభ్యులతో కొనకళ్ల మంగయ్య, పోతేపల్లి, బందరు మండలం, కృష్ణా**

## ఫీజు రీయింబర్స్‌మెంట్‌తోనే విదేశాలకు...





భగీరథరెడ్డి

మాది సాదాసీదా మధ్యతరగతి కుటుంబం. మా అబ్బాయి భగీరథరెడ్డిని ఎలాగోలా ఇంటర్ వరకు చదివించగలిగాం. మంచి మార్కులే తెచ్చుకున్నాడు. పైచదువులు ఎలా చదివించాలా అని మథనపడుతుండగా వైఎస్ రాజశేఖరరెడ్డిగారు ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకాన్ని ప్రవేశపెట్టారు. దాని ఆసరాతో మా అబ్బాయి చల్లపల్లి సన్‌ఫ్లవర్ ఇంజనీరింగ్ కాలేజీలో చేరాడు. సివిల్ ఇంజనీరింగ్ డిగ్రీ పూర్తిచేశాడు. తర్వాత షికాగోలో ఎంఎస్ స్ట్రక్చరల్ ఇంజనీరింగ్ పూర్తిచేశాడు. అమెరికాలోనే గూగుల్ ఫైబర్‌లో ఉద్యోగం తెచ్చుకున్నాడు. అమెరికాలో ఉంటున్నా మా అబ్బాయి వైఎస్ గారి స్ఫూర్తితోనే ఇక్కడి పేద విద్యార్థులకు వీలైనంత మేరకు సాయం చేస్తూ వస్తున్నాడు.

**- బొమ్మారెడ్డి వెంకటనరసింహారెడ్డి, ముస్తాబాద్, గన్నవరం మండలం, కృష్ణా**

## దారి చూపారు...



నిరుపేద కుటుంబంలో పుట్టాను. తల్లిదండ్రులు కూలిపని చేసి మమ్మల్ని పోషించారు. మా ఆర్థిక పరిస్థితి కారణంగా ఇంటర్‌తో చదువు ఆపేయాల్సిన పరిస్థితి. అయితే వైఎస్ రాజశేఖరరెడ్డి ప్రవేశపెట్టిన రీయింబర్స్‌మెంట్ పథకం ఆర్థిక కష్టాలను అధిగమించి చదువు కొనసాగేలా చేసింది. ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకాన్ని సద్వినియోగం చేసుకొని డిగ్రీ పూర్తి చేశాను. డిగ్రీ ఫైనలియర్‌లో ఉండగా నా తండ్రి సత్యం చనిపోయారు. అయినా ఫీజు రీయింబర్స్‌మెంట్ తోడుగా ఉండడంతో డిగ్రీ పూర్తి చేశాను. ఆర్ఆర్‌బీ పరీక్షల్లో ఉత్తీర్ణత సాధించి రైల్వే డిపార్ట్‌మెంట్‌లో సిగ్నల్ గేట్ ఆపరేటర్‌గా ఉద్యోగం సాధించాను. ప్రస్తుతం అనపర్తి రైల్వే స్టేషన్‌లో పనిచేస్తున్నాను.

**- కొత్తపల్లి శివప్రసాద్, చెల్లూరు, రాయవరం మండలం, తూర్పుగోదావరి**

## పైసా ఖర్చులేకుండా...



పేదలకు సాంకేతిక విద్యను అందించిన ఘనత వైఎస్ఆర్‌కే దక్కుతుంది. ఆర్థిక సమస్యల వల్ల ఏ విద్యార్థి చదువుకు దూరం కాకుండా ఉండడానికి ఫీజు రీయింబర్స్‌మెంట్ ఉపకరించింది. గ్రామీణ ప్రాంతంలో నేడు కనీసం 20 మంది విద్యార్థులైనా ఇంజనీరింగ్ చదువుతున్నారంటే అది వైఎస్ ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం వల్లే. పైసా చెల్లించకుండా కృష్ణా జిల్లా నూజివీడు ఇంజనీరింగ్ కాలేజీలో బీటెక్ చదివాను. ఈరోజు ప్రముఖ సాఫ్ట్‌వేర్ సంస్థ టీసీఎస్‌లో ఉద్యోగం సాధించాను. వైఎస్ వల్లే ఈ స్థాయిలో ఉన్నాను.

**- తలాటం కొండబాబు, కాకినాడ, తూర్పుగోదావరి**

## సైనసైటిస్‌కు హోమియో చికిత్స

## స్టార్ హోమియోపతి



డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి
www.starhomeopathy.com

**సైనసైటిస్... ఈపదం వర్షాకాలం, శీతాకాలంలో ఎక్కువగా వింటాం. సైనసైటిస్‌వస్తే ఆపరేషన్ తప్పని సరి, ఆ తరువాత కూడా మళ్ళీ వచ్చి దీర్ఘకాలికంగా బాధిస్తుం టుందని సైనసైటిస్ బాధితులు చెబుతు ఉంటారు. అయితే సైనసైటిస్‌కు హోమియోపతిలో అద్భుతమైన చికిత్స ఉందని, శాశ్వత నివారణ పొంద వచ్చని చెబుతున్నారు ప్రముఖ హోమియో వైద్యులు డాక్టర్ మురళీఅంకిరెడ్డి.**

ప్రపంచవ్యాప్తంగా సైనసైటిస్‌బాధితుల సంఖ్య రోజు రోజుకూ పెరుగుతోంది. ఒక్కఅమెరికాలోనే 2.4కోట్లకు పైగా సైనసైటిస్ బాధితులున్నారని అధ్యయనాలు చెబుతున్నాయి. ఇక.. సైనసైటిస్ విషయానికి వస్తే ఇది 3 విభాగాలుగా ఉంటుంది.

**1. అక్యూట్ :** వచ్చి ఒకవారం రోజులు ఉంటుంది.

**2. సబ్ అక్యూట్ :** 4నుంచి 8వారాలు ఉంటుంది.

**3. క్రానిక్ :** ఇది దీర్ఘకాలిక సైనసైటిస్. 8-10 వారాలపైన ఉంటుంది. సైనసైటిస్ ఇన్ఫెక్షన్, వైరస్, బ్యాక్టీరియా వల్ల వస్తుంది. ముఖ్యంగా స్ట్రెప్టోకోకస్ న్యుమోనియా, ఇన్‌ఫ్లూయెన్‌జా వల్ల వస్తుంది. ప్రతి మనిషి తన జీవిత కాలంలో సైనసైటిస్ బారిన పడటానికి 90% అవకాశాలున్నాయి. అత్యధికంగా వెళ్ళే సర్జికల్ ప్రాసెస్‌లో ఈ సైనసైటిస్ కూడా ఒకటని ఒక పరిశోధనలో తేలింది. సుమారు 2 లక్షల కేసులు సర్జరీకి దారితీస్తాయి. ఏదెలా ఉన్నా సైనసైటిస్‌కు హోమియోలో అద్భుత చికిత్స ఉంది. పూర్తిగా మందుల ద్వారా నివారించడమే కాకుండా, వ్యాధి నిరోధక శక్తిని పెంచి మళ్ళీ మళ్ళీ రాకుండా నివారించ వచ్చు. ముఖంలో కళ్లదగ్గర, ముక్కు పక్క భాగంలో, ఎముకలు ఉండే సన్నని గాలితో నిండే ప్రదేశాన్ని సైనస్ అంటారు. ఈ భాగం ఇన్‌ఫెక్షన్లతో వాచిపోవడమే సైనసైటిస్. రకాలు: 1. ఫ్రంటల్ 2. పారా నాసల్ 3. ఎత్మాయిడల్ 4. మాగ్జిలరీ 5. స్ఫీనాయిడల్ ఇవి కూడి, ఎడమగా రెండు జతలుంటాయి. **కారణాలు:** ఇన్‌ఫెక్షన్, బ్యాక్టీరియా, వైరస్, ఫంగస్, ఉపరితల శ్వాసకోశ వ్యాధులు, ముక్కులోదుర్వాసన, ముక్కులో దుర్మాంసం పెరుగుదల, అలర్జీ, పొగ, విష వాయువుల కాలుష్యం, వాతావరణ కాలుష్యం, అకస్మాత్తుగా వాతావరణ మార్పులు, చలికాలం, వర్షా కాలం, గాలిలో తేమ ఎక్కువగాఉండే సమయం. నీటిలో ఈదటంవల్ల, జలుబు, గొంతునొప్పి, పిప్పిపన్ను, టాన్సిల్స్ వాపు, రోగనిరోధక శక్తి తగ్గిపోవటం. **లక్షణాలు:** ముఖంలో భారంగా ఉంటుంది. తలనొప్పి, బరువు, ముఖంలోవాపు, సైనస్‌భాగంలో నొప్పి ముక్కు దిబ్బడ, ముక్కుదురద, నీరుకారడం, గొంతులోనికి ద్రవంకారడం, గొంతుగరగర, దగ్గు,జలుబు, చెవిలో చీము, కోపం, మానసిక స్థైర్యం కోల్పోవడం. అలసట, విసుగు, పనిపై ఆసక్తి తగ్గటం, హోరు దగ్గు. **నిర్ధారణ:** ఎక్సరే, సిటీస్కాన్, సైనస్‌భాగంలో నొక్కినపుడు నొప్పి కలిగితే కూడా సైనసైటిస్‌ను నిర్ధారించవచ్చు. **దుష్పరిణామాలు:** దీర్ఘకాలికంగా సైనసైటిస్ వ్యాధితో బాధపడేవారు కనురెప్పల వాపు, కనుగుడ్లు పక్కకు జరిగినట్లు ఉండటం, కన్నునరం దెబ్బతిన్నపుడు చూపు కోల్పోవడం, వాసనలు తెలియక పోవడం, తరుచూవచ్చే జ్వరం, ఎదుగుదల లోపాలు కలుగుతాయి. **సైనస్‌ను గుర్తించే ప్రశ్నావళి:** మీరు పది రోజుల కంటే ఎక్కువగా ఈ కింది వాటిలో దేనితోనైన బాధ పడుతు న్నారా? అయితే మీకు సైనసైటిస్ ఉన్నట్లే. వెంటనే డాక్టర్‌ను సంప్రదించడం మంచిది.

1. ముఖబాగంలో నొప్పి - అవును/ కాదు. 2.తలనొప్పి - అవును / కాదు. 3. ముక్కుదిబ్బడ - అవును/ కాదు 4. చిక్కటి పసుపు, ఆకుపచ్చ ముక్కు స్రావాలు - అవును/కాదు. 5.జ్వరం (99-100 ఫారెనెహీట్స్) - అవును/కాదు. 6.నోటి దుర్వాసన - అవును/కాదు.. 7. పంటినొప్పి - అవును /కాదు. **నివారణ:** మీ నోటిని తరుచూ గోరు వెచ్చని నీటితో శుభ్రం చేస్తూండాలి. అలర్జీకి సంబంధించిన దుమ్ము, ధూళికి దూరంగా ఉండాలి. ఇల్లుపరిశుభ్రంగా ఉంచుకొని చుట్టూ బురధ లేకుండా చూసుకోవాలి. ఈత కొలనులో ఎక్కువ సమయం ఉండ కూడదు. ఎందుకంటే ఆనీళ్ళు ముక్కు లోపలి దళసరి చర్మాన్ని దెబ్బతీస్తాయి. ఎక్కువగా చల్లని పదార్థాలు, చల్లని గాలి తగలకుండా చెవిలో దూది పెట్టుకోవడం, వేడి ఆవిరి పట్టడం వల్ల దీన్ని కొంత వరకు నివారించవచ్చు. **హోమియోచికిత్స:** హోమియోపతిలో అపరేషన్‌లేకుండా మంచి మందులున్నాయి. వాటిలో ముఖ్యంగా కాలిబైక్, కాలిసల్ఫ్, హెపార్‌సల్ఫ్, మెర్క్‌సాల్, సాంగ్న్యూరియా, లెమ్‌నార్ మైనార్, స్పైజిలియా వంటి మందులు మంచి ఫలితాన్నిస్తాయి.

సికింద్రాబాద్, కొత్తపేట, కూకట్‌పల్లి, గచ్చిబౌలి, హన్మకొండ, వైజాగ్, తిరుపతి, విజయవాడ, రాజమండ్రి, గుంటూరు, కర్నాటక, దుబాయి, లండన్, మాంచెస్టర్. ✆ 90300 75455

## మహిళల్లో సంతానలేమి ఆధునిక పరిష్కార మార్గాలు

## ఫర్టీ 9 సంతాన సాఫల్యత కేంద్రం



డా. సి.జ్యోతి. ఫెర్టిలిటీ స్పెషలిస్ట్
ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం

**సంతానం అనేది స్త్రీలకు దేవుడిచ్చిన వరం, కానీ ప్రస్తుతం చాలా మంది స్త్రీలు కొన్నిరకాల కారణాలువలన 'సంతానలేమి' సమస్య తో బాధపడుతున్నారు. మనసమాజం ఆధునికతను సంతరించు కుంటున్నకొద్దీ ఎంతోమంది దంపతులు "సంతానలేమి" సమస్య ను ఎదుర్కొంటున్నారు. దీనికికేవలం శారీరక వ్యాధులు, లోపాలే కాదు, మారుతున్న జీవనశైలి, ఆహారపు అలవాట్లు, రాత్రివేళ ఉద్యోగాలు, మానసిక ఒత్తిడి వంటివి గణనీయమైన పాత్ర పోషిస్తున్నాయి. అయితే ఆధునిక విజ్ఞానం పెరిగిన ఈ రోజుల్లో సంతానలేమికి చక్కటి పరిష్కారాలు అందుబాటులో ఉన్నాయి కనుక ఆందోళన చెందవలసిన అవసరం లేదు అంటున్నారు మన ఫర్టీ 9 హాస్పిటల్ వైద్యులు డా॥ సి.జ్యోతి.**

అసలు సంతానలేమి అంటే ఆరోగ్యవంతులైన దంపతులు ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించకుండా ఏడాది పాటు దాంపత్యజీవనం సాగించినా పిల్లలు కలగపోవటాన్ని "సంతానలేమి" అంటారు. దీనికి కవలం స్త్రీలనునిందించటం సర్వసాధారణం. కానీ నిజానికి స్త్రీ, పురుషులిద్దరూ సమాన భాగస్వాములే. **స్త్రీలలో సంతానలేమిని 2 రకాలుగావిభజించ వచ్చు:** 1.ప్రైమరీ ఇన్‌ఫెర్టిలిటీఅంటే స్త్రీ ఏడాదినుండి రెండేళ్ల పాటు సాధారణ లైంగిక జీవితం గడిపినప్పటికీ గర్భం ధరించ కపోవటం. 2. సెకండరీ ఇన్‌ఫెర్టిలిటీ అంటే స్త్రీ సాధారణ లైంగిక జీవితం గడపటంవలన ఒకసారి గర్భ ధారణ జరిగి, పిల్లలు కలిగినా లేదా గర్భస్రావమై, రెండవ సారి గర్భధారణ జరగక పోవటం. **స్త్రీలలో సంతానలేమికి గల కారణాలు: స్త్రీ ప్రత్యుత్పత్తి వ్యవస్థలోలోపాలు:** అవి ముఖ్యంగా 1. చిన్న గర్భ సంచి ఉండటం (ఇనెఫాంటైల్ యుటి రస్) లేదా అసలు గర్భ సంచి లేకపోవటం. 2.రెండుగదులుగా ఉండే గర్భసంచి ( బైకార్న్ మేట్ యుటి రస్) 3.యోని మార్గం చిన్నగాఉండటం లేదా మూసుకు పోవటం 4.ఫాలో పియన్‌ట్యూబ్స్ మూసుకు పోవటం. **బీజవాహికలలో లోపాలు:** 1.సాల్పింజైటీస్-ఇది బీజ వాహికల్లో వచ్చేవాపు. 2.హైడ్రోసాల్పింక్స్-దీనిలో బీజ వాహికలు ద్రవంలో నిండి మూసు కుపోతాయి. ఇది ముఖ్యంగా గర్భసంచి ఇన్‌ఫెక్షన్‌ల వల్ల ముఖ్యంగా టీ.బి, లైంగికంగా సంక్రమించే వ్యాధుల వల్ల వస్తుంది. 3.ఎక్టోపిక్‌ప్రెగ్నెసీ **హార్మోన్ సమస్యలు:** 1.థైరాయిడ్, మధుమేహం వంటివి. 2.ఎఫ్.యస్.హెచ్, ఎల్.హెచ్, వంటివి ప్రోలాక్టిన్ వంటి హార్మోన్ల అసమతుల్యత 3. పి.సి.ఒ.డి 4. ఎ.ఎమ్.హెచ్ వంటి హార్మోన్స్ స్థాయిలు తగ్గటం వలన కూడా సంతాన అవకాశాలు తగ్గుతాయి. 5.అండా శయంలో కణుతులు లేదాపాలిసిస్టిక్ ఓవరీస్ వంటివి. **యోని, గర్భసంచిలోలోపాలు:** మహిళల్లో సంతాన లేమి సమస్యలకు 5% కారణాలు దీనికి సంబంధించినవే. 1. ఎండోమెట్రియాసిస్ 2. గర్భసంచిలో కణితులు ఏర్పడటం (యుటిరైన్ ఫైబ్రాయిడ్స్)పాలిప్స్, సర్వైకల్ ఫైబ్రాయిడ్స్, ఎడినోమయోసిస్ వంటివి. 3.యోనిలోఉండే మ్యూకస్ పొర అధికఆమ్ల గుణాన్ని కలిగి ఉండటంవలన కూడా శుక్రకణాలు చని పోవటం వంటివి సంతానలేమికి కారణాలు. 4.గర్భసంచికి సోకే టి.బి. లైంగికం గా సంక్రమించే వ్యాధులు ( ఎస్.టి.డిస్ )గర్భసంచి ఇన్‌ఫెక్షన్స్. **ఇతర కారణాలు:** 1.వయసు, అధిక బరువు, 2. స్త్రీలలో 30 సంవత్సరాల వయసు దాటిన తర్వాత గర్భం దాల్చే అవకాశాలు తగ్గుతాయి. వయసుతో పాటు అండాల ఉత్పత్తి తగ్గటం, హార్మోన్స్ స్థాయిలలో తేడాలు కూడా అధిక గర్భస్రావానికి అవకాశాలను పెంచుతాయి. వయసు పెరిగిన కొద్ది సంతాన అవకాశాలు తగ్గుతాయి. 3.కొన్నిసార్లు ఎటువంటి కారణం లేకుండా కూడా సంతానలేమి ఉంటుంది. ఇటువంటి వారికి కృత్రిమ పద్ధతుల ద్వారా చికత్స చేస్తారు. **స్త్రీలలో సంతానలేమికి నిర్ధారణ పరీక్షలు:** 1. థైరాయిడ్ పరీక్షలు, హార్మోనల్ ఎస్సే (ఈస్ట్రోజన్,ప్రోజెస్టిరాన్,ఎఫ్.సి.హెచ్, ఎల్.హెచ్, ప్రోలాక్టిన్ వంటివి). 2.అల్ట్రాసౌండ్‌పెల్విక్‌స్కానింగ్. 3. ఫాలిక్యు లార్ స్టడీ 4.హిస్టిరో సాల్పింజియోగ్రామ్(హెచ్.ఎస్.జి) 5.డయా గ్నోస్టిక్ లాప్రోస్కోపి వంటివి. **వీరికిచేయదగినచికిత్సలు:** ఇందులో ముఖ్యమైనవి 1.హార్మోన్ థెరపీ 2. ఐ.యు.ఐ 3. ఐ.వి.ఎఫ్ 4.ఇక్సి 1.హార్మోన్‌థెరపిలోమందులద్వారా ఋతుచక్రసంబంధ లోపాలను సవరించవచ్చు. అండాల విడుదలను ప్రేరేపించ వచ్చు. 2.లాప్రోస్కోపిక్ సర్జరీ ద్వారా అండాశ యంలోని నీటి తిత్తులను (పిసిఒడి) ని సవరించవచ్చు. 3. ఐ.యు.ఐ. దీనిలో పురుషుల్లోని శుక్రకణాలను నేరుగా స్త్రీ గర్భశయంలోకి ప్రవేశపెడతారు. దీన్ని అండం విడుదలజరిగినపుడు చేయడం ద్వారా గర్భధారణకి అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. దీన్ని ఎక్కువగా వీర్యకణ లోపాలు ఉన్నపుడు, స్త్రీలలో బీజవాహికలలో సమస్యలు ఉన్నపుడు సూచిస్తారు. దీన్ని 6నుంచి 10 ఋతుచక్రాలు ప్రయత్నించవచ్చు. అంతే కాక ఇది తక్కువ వ్యయం కూడా. 4. ఐ.వి.ఎఫ్. దీన్ని "టెస్ట్‌ట్యూబ్‌విధానం" అంటారు. దీనిలో స్త్రీ అండాన్ని, పురుషుడి శుక్రకణాన్ని లేబరేటరీ లో ఫలదీకరణం చెందించి తిరిగి స్త్రీ గర్భాశయం లోకి ప్రవేశపెడతారు. దీన్ని ఎక్కువగా స్త్రీలలో ట్యూబులు మూసుకున్న వారికి, శుక్రకణాల సంఖ్య కదలికల్లో లోపాలు మగవారిలో ఉన్నపుడు, దంపతుల వయసు ఎక్కువగా ఉన్న పుడు సూచిస్తారు. 5. ఇక్సీ, దీన్ని ఐ.వి.ఎఫ్ సత్ఫలితాలను ఇవ్వ నిసందర్భంలో ఉపయో గిస్తారు. ఇందులో శుక్రకణాలను కృత్రిమ పద్ధతి ద్వారా అండంలోకి ప్రవేశపెట్టి ఫలదీకరణం చెందిస్తారు. అలా ఫలదీకరణం చెందించిన దాన్ని తిరిగి స్త్రీ గర్భాశయంలోకి ప్రవేశపెడతారు. ఇటువంటి అత్యాధునిక చికిత్సల ద్వారా సంతానలేమికి మంచి పరిష్కారాన్ని పొందవచ్చు. "ఫర్టీ 9 హాస్పిటల్" లో నిపుణులైన వైద్యులు పరీక్షలు నిర్వహించి, మీ సమస్యలకు తగిన సంతాన సాఫల్య చికిత్సలను సూచిస్తారు. దీని ద్వారాఎంతో మంది దంపతులు సంతాన భాగ్యాన్ని పొందుతున్నారు.

ADVT

సికింద్రాబాద్ । కూకట్‌పల్లి । మదాపూర్ । సంతోష్‌నగర్ । వరంగల్ www.ferty9.com ✆ 90300 15588



## వైఎస్ఆర్ నా ఇంటి పెద్ద కొడుకు

వైఎస్.రాజశేఖరరెడ్డి నాకు పెద్ద కొడుకులాంటి వాడు. నేను భూమి మీద జీవిస్తున్నాను అంటే ఆయన పుణ్యమే. 2005లో మొట్టమొదటి సారిగా రాజీవ్ ఆరోగ్యశ్రీ పథకం ప్రవేశ పెట్టినప్పుడు...ఆ పథకం ద్వారా హైదరాబాద్‌లో గుండె బైపాస్



సర్జరీ చేయించుకున్నాను. ఆ సౌకర్యం లేకుంటే డబ్బులు పెట్టే స్థోమత నాకు లేదు. నేను బతికేదాన్ని కాదు. నా పెద్దకొడుకు రాజశేఖరరెడ్డే నన్ను బతికించిండు. నాకు ముగ్గురు కొడుకులు ఉన్నారు. పెద్దాయన వైఎస్సారే. నేను, నా కుటుంబం ఆయనను ఎప్పుడూ మరవలేం. నా వయస్సు 80 ఏళ్లు దాటినా నేను ఆరోగ్యంగా ఉన్నాను. ప్రతిరోజు రాజశేఖర్‌రెడ్డి యాదికొస్తడు.

**- అంబూబాయి, మదనాపురం, వనపర్తి**

## ఆయన లేకుంటే బతికేవాణ్ని కాదు...



తీవ్ర ఆయాసంతో బాధ పడుతూ 2008లో డాక్టర్ల దగ్గరకు వెళ్లాను. గుండెలో మూడు వాల్వ్‌లు మూసుకుపోయాయని చెప్పారు. ఆపరేషన్‌కు లక్షన్నరకు పైగా ఖర్చయితదని అన్నారు. నేను నెలకు రెండు వేలు మాత్రమే సంపాదించేవాడిని. నా భార్య చనిపోవడంతో నా ఇద్దరు కూతుళ్లను పోషించేందుకే నా సంపాదన సరిపోయేది. నా బతుకు ఇంతే అనుకున్నాను. వైఎస్ఆర్ ఆరోగ్యశ్రీ పథకం ప్రవేశపెట్టిన సంగతి నాకు డాక్టర్లు చెప్పారు. దీంతో హైదరాబాద్‌లో ఆపరేషన్ చేయించుకున్నా. ఆపరేషన్ అయ్యాక ఇప్పుడు నా ఆరోగ్యం బాగుంది. నా బిడ్డలకు పెళ్లిళ్లు చేశాను. ఆరోగ్యశ్రీ లేకుంటే ఇప్పుడు నేను ఈ లోకంలో ఉండేవాడిని కాదేమో.

**- గడ్డం వెంకటస్వామి, చౌటబెట్ల, కొల్లాపూర్, నాగర్‌కర్నూల్**

## నా ప్రాణదాత



నాకు పునర్జన్మనిచ్చిన దేవుడు వైఎస్‌రాజశేఖరరెడ్డి. రెక్కాడితేగానీ డొక్కాడని పరిస్థితి మా కుటుంబానిది. వెన్నునొప్పితో బాధ పడుతున్న నేను కార్పొరేట్ ఆస్పత్రికి వెళ్లి వైద్యం చేసుకోవాలంటే చిల్లి గవ్వ లేదు. ఆపరేషన్ చేయకపోతే ప్రమాదమని వైద్యులు చెప్పారు. ఆపరేషన్‌కు రెండు లక్షలు ఖర్చు అవుతాయని చెప్పారు. ఈ పరిస్థితుల్లో రాజీవ్ ఆరోగ్యశ్రీ పథకం ద్వారా ఆపరేషన్ చేయించుకున్నాను. ఇప్పటి వరకు ఎలాంటి ఇబ్బందులు లేవు. ఆరోగ్యశ్రీతో వైఎస్ నాకు కొత్త జీవితాన్ని ప్రసాదించారు. ప్రాణదాత అయ్యారు. వైఎస్ పుణ్యానే నాకు ప్రభుత్వం మూడెకరాల అసైన్డ్ భూమిని పట్టా చేసింది. వైఎస్ ప్రయాణిస్తున్న హెలికాప్టర్ కనిపించడం లేదనే వార్త విని ఎంతో ఏడ్చాను. ఆయన బతికిరావాలని గ్రామంలోని ఆంజనేయస్వామి ఆలయంలో 25 టెంకాయలను కొట్టాను.

**- శివారెడ్డి, శేర్నపల్లి, నారాయణపేట మండలం, మహబూబ్‌నగర్**

## నా దేవుడు వైఎస్సే..!



నేను కూలీపని చేసుకొని బతుకీడుస్తున్న. 2009ల ఓ రోజు నాకు అపెండిసైటిస్ వచ్చింది. చేతిలో పైసల్లేవ్. దవాఖానాకు పోతే వేలకు వేలు ఖర్చవుతయని చెప్పి నొప్పి మీదనే ఉన్న. నడుముకి గట్టిగ తువ్వాల కట్టి రెండు, మూడు రోజులు అట్లనే ఓపిక బట్టిన. మూడోనాడు నొప్పి ఎక్కువైతే లాభం లేదని హనుమకొండల ఓ దవాఖానల చేరిన. అపెండిసైటిస్ గొట్టం పగిలి, కడుపంతా విషం పాకిందని, ఆపరేషన్ చేయాలని చెప్పిర్రు. ఆరోగ్యశ్రీ కార్డు మీద 2లక్షల రూపాయల ఆపరేషన్ ఫ్రీగా అయింది. అదే లేకుండ పోతే నేను సచ్చి ఎనిమిదేండ్లు అయి ఉండెడిది. నాకు మళ్ళా జన్మనిచ్చిన దేవుడు వైఎస్. ఆయన ఫొటో పట్టుకొనే వార్డ్‌మెంబర్‌గా నిలబడి గెలిషిన. గిప్పుడు వార్డ్ మెంబర్ అయినంక నన్ను గెలిపించినోళ్ళకు తోడుంటున్న. నేను సచ్చేంతవరకు వైఎస్సే నా దేవుడు. ఆయనే నన్ను ముందుకు నడుపుతున్నడు.

**- జన్ను సాంబయ్య, హసన్‌పర్తి, వరంగల్ రూరల్**

## పాప చిరునవ్వుల్లో...

**మా** పాప కరుణశ్రీ (9) నాలుగేళ్ల వయసు ఉన్నప్పుడు అనారోగ్యానికి గురైంది. ఆస్పత్రిలో చూపిస్తే గుండెకు చిల్లు పడిందని చెప్పారు. 2011లో ఆరోగ్యశ్రీ పథకం కింద గుండె ఆపరేషన్ చేయించాం. ప్రస్తుతం పాప నాగర్‌కర్నూల్ సీఎస్ఆర్ పాఠశాలలో అయిదో తరగతి చదువుతుంది. పాప చిరునవ్వులో వైఎస్‌ను చూసుకుంటున్నాము.



కరుణశ్రీ

**- జయసుధ, అవురాసిపల్లి, నాగర్‌కర్నూల్**

## పునర్జన్మ ఇచ్చిన మహానుభావుడు

**భా**ర్యను ప్రాణాపాయం నుంచి కాపాడుకునేందుకు చేసిన అప్పు తీర్చడానికి లారీడ్రైవరుగా రాత్రింబవళ్లు కష్టపడ్డాను. ఈ క్రమంలో జబ్బు పడ్డాను. ఆస్పత్రిలో చూపిస్తే కిడ్నీ పాడైందని, ఆపరేషన్ చేయాలని అన్నారు. లక్షల రూపాయల వ్యవహారం కావడంతో చావే శరణ్యం



అనుకున్నాను. భార్య, నలుగురు ఆడపిల్లలు. నేను పోతే నా భార్యాబిడ్డల పరిస్థితి ఏమిటి? అని కుమిలిపోతున్న సమయంలో వైఎస్ పేదల కోసం ప్రారంభించిన ఆరోగ్యశ్రీ పథకం గురించి తెలిసింది. అలా వైఎస్ పుణ్యమా అని కిడ్నీ ఆపరేషన్ ఉచితంగా చేయించుకోగలిగాను. ఆరోగ్యవంతుడిగా ఇంటికి చేరాను. నా తల్లి రాములమ్మ జన్మనిస్తే వైఎస్సార్ పునర్జన్మ ఇచ్చారు.

**- పెద్దపిరంగి అంజిలయ్య, కోస్గి, మహబూబ్‌నగర్**

వాస్తు విద్వాన్, సాయిశ్రీ
**గౌ॥డా॥ దంతూరి పండరీనాథ్**

వాస్తు వీక్షణం



## వాయుచ్ఛిద్ర వేధ

వాస్తు శాస్త్రములో **'గాలివాటము'** యొక్క విశిష్టత ప్రత్యేకముగా చెప్పబడినది. వాయుపీడనము, వాయుసాంద్రత, వాయుగతి, వాయు గమనములు ప్రాణి యొక్క జీవితమును, జీవన విధానమును, ఆరోగ్యమును, ఆలోచనలను ప్రభావితము చేస్తూ ఉంటాయి. గాలి ఆడని గదిలో జీవితం సాగించు వారు అనేక విధములుగా ఆనారోగ్యములకు గురవుతూ ఉంటారు. గాలి వచ్చుటకు ఒక గవాక్షమును (కిటికీని) ఏర్పాటు చేయుట వలన ప్రయోజనము ఉండదు. ఆ కిటికీకి ఎదురుగా మరొక కిటికీని ఏర్పాటు చెసినప్పుడు మాత్రమే గాలి ఒక కిటికీ గుండా గదిలోపలికి వీచి మరొక కిటికి గుండా బయటకు వెళుతుంది. ఈ నిరంతర ప్రక్రియ వలన ఆ గదిలోని గాలి ఎప్పటికప్పుడు మారుతు ఉండడం వలన మెరుగైన ఆరోగ్యంతో జీవించగలుగుతాము (ప్రవాహం లేని నీరు, కదలని గాలి...... విషతుల్యమైనవి.) **సాధారణంగా ఎక్కువ శాతం గాలి వాటం పశ్చిమం నుండి తూర్పుకు లేదా దక్షిణం నుండి ఉత్తరమునకు లేదా నైరుతి నుండి ఈశాన్యానికి వీస్తూ ఉంటుంది.** మనం గాలి కోసం వెలుతురు కోసం అమర్చే గవాక్షములు గృహానికి పడమర వైపు మరియు దక్షిణం వైపు గోడలకు తప్పకుండా ఉండాల్సిందే! ఈ విధముగా పశ్చిమ దక్షిణ దిశలయందు గవాక్షములు లేకపోవుట చేత 'వాయుచ్ఛిద్రము' అను వేధ దోషము ఆ గృహమునకు సంప్రాప్తిస్తుంది. **'వాయుచ్ఛిద్ర వేధ'** దోషము కలిగిన గృహములో నివసించు వారు కలుషితమైన గాలిని నిరంతరము పీల్చుకోనవలసి ఉంటుంది. అందుచేత వారికి, వారి సంతతికి అనేక రకముల అనారోగ్య సమస్యలు ఉత్పన్నమయ్యే అవకాశముంటుంది.

ఇట్టి దోషమున్న గృహమున నివసించు వారు ఈ అనారోగ్యములతో బాధపడుతున్నట్లయితే ..... ఆ గృహమునకు **పశ్చిమ మరియు దక్షిణ దిక్కుల యందు గోడలకు గవాక్షములు ఏర్పరుచుకున్నట్లయితే వాస్తు దోషం నివరింపబడుతుంది.** గృహములోకి గాలి ధారళంగా గాలి వీస్తుంది. అనారోగ్య సమస్యలు క్రమంగా తగ్గుతాయి. ఆలోచనా విధానములో చెప్పుకోతగినంత మార్పు వస్తుంది. అనుకూలమైన నిర్ణయాలు తీసుకోగలుగుతారు. ఆ విధంగా జీవితంలో పురోగతిని ఆశించవచ్చును.

### ఏదీ కలిసి రావటం లేదు...

.... అప్పటి నుండి.... మాకు ఏది కలిసి రావటం లేదు. ఆరోగ్య సమస్యలు, ఆర్థిక బాధలు అన్ని విధాలుగా మాకుటుంబం కష్టాలను అనుభవిస్తున్నది. దయచేసి నా వ్యవహారనామ రీత్యా ఏ దిక్కు సింహద్వారమైతే బాగుంటుందో తెలుపగలరు.

**- శివకుమార్, హైదరాబాద్.**

మీకు వ్యవహార నామ రీత్యా ఉత్తరము లేదా ఉత్తర ఈశాన్యము ముఖద్వారము ఉన్న గృహము యోగిస్తుంది. ప్రస్తుతము మీరు పశ్చిమ ముఖద్వారము కలిగిన మేడ పై గల అంతస్తులో నివాసముంటున్నారు. **ఆ గృహానికి కుబేర స్థానమైన ఉత్తరములో టాయిలెట్స్ ఉన్నాయి.** ఈశాన్యమున కూడా ఒక బెడ్‌రూమ్ ఉన్నది. ఈశాన్యము మూతపడినది. ఇటువంటి దోషములున్నప్పుడు సహజంగానే మీకు బాగుండదు. మార్పులకు వీలుకాదు, కాబట్టి ప్రత్యామ్నాయ పద్ధతులు పాటించటం వలన మెరుగైన ఫలితాలను సాధించవచ్చును. **రావలసిన ధనము ఆగిపోవటం, అప్పు తీసుకున్న వాళ్ళు తిరిగి ఇవ్వకపోవటం మొదలైన ఆర్థిక సమస్యలకు చాలా వరకు వాస్తు దోషాలే కారణమవుతాయి.** వాటిని సరిచేసుకోనుట మంచి పద్ధతి. అలా వీలు కానప్పుడు ప్రత్యామ్నాయ పద్ధతులు మెరుగైన ఫలితాలనిస్తాయి. ఒకసారి ఆ ఇల్లు మాకు చూపిస్తే పరిష్కారము చెప్పె వీలుంటుంది.

వచ్చేవారం... 'స్తంభ వేధ'






## వైఎస్ ఆశయాలే మాకు రక్ష!



దివంగత ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి గారి ఆశయాలే మాకు శ్రీరామ రక్ష. మాదొక దిగువ మధ్యతరగతి కుటుంబం. మేము ముగ్గురం ఆడపిల్లలం. మా నాన్న పేరు సైదులు. ముగ్గురం ఆడపిల్లలమే అయినా మాకు మంచి చదువు చెప్పించాలని అనుకుంటూ ఉండేవాడు. నేను ముగ్గురిలో చివరిదాన్ని. 2010లో పదో తరగతిలో నాకు 560మార్కులు వచ్చాయి. అప్పుడే వైఎస్సార్ గారు పేదవాళ్ళు మంచి చదువులు చదవాలని బాసరలో స్థాపించిన ట్రిపుల్ఐటీలో సీట్ వచ్చింది. ఫీజు రీయింబర్స్‌మెంట్‌తో ప్రభుత్వమే నా చదువుకయ్యే ఖర్చు భరించింది. అమ్మ, నాన్నల కల నెరవేర్చాలని కష్టపడి చదివి క్యాంపస్ సెలక్షన్స్‌లో విప్రో కంపనీలో ఉద్యోగం సాధించా. ఇప్పుడు మంచి జీతంతో పనిచేస్తున్నందుకు అందరం సంతోషంగా బతుకుతున్నాం. పేదవారికి మంచి చదువులు చెప్పిస్తేనే సమాజం బాగుపడుతుందని చెప్పిన వైఎస్సార్ మాటలంటే ఎంతో ఇష్టం. ఆయన ఆశయం వల్లే ఈ రోజు నేను ఈ స్థాయిలో ఉన్నా. ఆయన ఆశయాలు ఎప్పటికీ బతికే ఉండాలి.

- చాపల శరణ్య, హాలియా, నల్లగొండ

## మా పాప బతికుందంటే వైఎస్ వల్లే!

మా పాప పార్వతి పుట్టాక గుండె జబ్బు ఉందని తెలిసింది. గుండె కవాటాల్లో లోపం ఉండటంతో పాప ఆడుకుంటూ ఆడుకుంటూనే కళ్ళు తిరిగి పడిపోయేది. అలా జబ్బు పడినప్పుడల్లా హాస్పిటల్‌కు వెళ్ళడం, కొన్ని మందులు తీసుకోవడం.. ఇదే చేస్తూ వచ్చాం. ఒకసారి జబ్బు ముదిరిపోయింది. పాపకు నయమవ్వాలంటే ఆపరేషన్ చేసి తీరాల్సిందేనన్నారు. 2లక్షల దాకా ఖర్చవుతుందన్నారు. వంటపని చేసుకొని బతికే నాకు అంత స్థోమత లేదు. ఏమీ చేయలేని పరిస్థితుల్లో ఇక్కడ, అక్కడా అంటూ ఓ తొమ్మిది సంవత్సరాలు పాపను భుజాన వేసుకొని తిరిగాం. కొన్ని చోట్లైతే ఆపరేషన్ చేసినా బతకడం కష్టమని చెప్పారు. పుట్టపర్తికి వెళ్ళినా అక్కడ 14ఏళ్ళు వచ్చాకే ఆపరేషన్ చేస్తామన్నారు. ఇక మాకు ఏదారీ లేని సమయంలో వైఎస్ రాజశేఖరరెడ్డి దేవుడిలా ఆదుకున్నాడు. గుండె జబ్బులున్న పిల్లలకు రాజశేఖరరెడ్డి ప్రభుత్వం ఉచితంగా ఆపరేషన్ చేస్తుందన్న విషయం తెలుసుకొని పెనమలూరులో జరిగిన క్యాంపుకు వెళ్ళాం. అక్కడి నుంచి ఆపరేషన్‌కు హైద్రాబాద్‌కు తీసుకెళ్ళారు. ఇన్నోవా హాస్పిటల్‌లో ఎనిమిది గంటల పాటు శ్రమించి డాక్టర్లు ఆపరేషన్‌ను విజయవంతం చేశారు. పాప స్పృహలోకి రాగానే మేం పడ్డ సంతోషం మాటల్లో చెప్పలేనిది. వైఎస్ దయవల్ల పార్వతి ఇప్పుడు ఆరోగ్యంగా ఉంది. పాలిటెక్నిక్ మూడో సంవత్సరం చదువుతోంది. ప్రమాదంలో వైఎస్ చనిపోయారన్న వార్తను తట్టుకోలేకపోయా. 2015లో ఇడుపులపాయలో వైఎస్ వర్ధంతి రోజున వంటలు చేసేందుకు వెళ్ళా. అప్పుడే ఆయన సమాధిని దర్శించుకునే భాగ్యం కలిగింది. ఆరోజు ఆయన సమాధి ముందు నిలుచున్నప్పుడు కన్నీళ్ళను ఆపలేకపోయా.



కూతురు పార్వతితో కనకదుర్గప్రసాద్

- ఆరేపల్లి కనకదుర్గ ప్రసాద్, లబ్బీపేట, విజయవాడ



## ఆడపిల్లల చదువు.. ఆయన పుణ్యమే!

రోల్డ్‌గోల్డ్ పనులు చేసుకొని బతికే ఓ పేద కుటుంబానికి ఇంటి పెద్దను నేను. పదోతరగతి వరకే చదివా. నా భార్య కూడా పెద్దగా చదువుకోలేదు. మాకు ముగ్గురు ఆడపిల్లలు. మేము చదువుకోకపోయినా పిల్లలకైనా మంచి చదువులు చెప్పించాలని కలలుగన్నా. ఇంటర్ వరకూ పిల్లలను చదివించడమైతే చదివించగలిగా కానీ ఆ తర్వాత నా వల్ల కాదేమో అనిపించింది. అయితే వైఎస్సార్ పుణ్యమా అని ఫీజ్ రీయింబర్స్‌మెంట్ రావడంతో ఒక ధైర్యం వచ్చింది. పెద్దమ్మాయి రహీమా బేగం టీటీసీ చేసింది. రెండో అమ్మాయి రియాసాతా బేగం కంప్యూటర్ సైన్స్ ఇంజనీరింగ్ చేసింది. మూడో అమ్మాయి కూడా ఇంజనీరింగ్ చేసింది. ప్రస్తుతం రెండో అమ్మాయి, మూడో అమ్మాయి బెంగళూరులో మంచి ఉద్యోగాలు చేస్తూ వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు నిలబడ్డారు. లక్షలు కడితే గానీ పొందలేని చదువును నా పిల్లలు ఫ్రీగా పొందారు. అదంతా వైఎస్సార్ వల్లనే! నాలాంటి పేదవాడి కడుపున పుట్టిన పిల్లలు, అదీ ఆడపిల్లలు ఇంత పెద్ద చదువు చదివారంటే వైఎస్సార్ పుణ్యమే అది.

- అబ్దుల్ హకీమ్, పెడన, కృష్ణా

## తాతయ్య లేడనే బెంగ అలాగే మిగిలిపోయింది!



నాకు ఐదేళ్ళున్నప్పుడు జబ్బు చేస్తే గుండెకు రంధ్రాలు పడ్డాయని తెలిసిందట. ఆపరేషన్ చేస్తేగానీ బతకనని డాక్టర్లు అన్నారట. దానికేమో 5లక్షల దాకా ఖర్చు అవుతుందని, అంత డబ్బులు లేని పరిస్థితుల్లో అమ్మా, నాన్న చెప్పలేని కష్టాలు పడ్డారట. అప్పుడే వైఎస్ తాతయ్య పెట్టిన ఆరోగ్యశ్రీ గురించి తెలిసి దాని ద్వారా నా ఆపరేషన్ చేశారట. మాదొక నిరుపేద కుటుంబం. అమ్మా, నాన్న ఆరోజుల్లో ఏ స్థాయిలో కష్టపడి ఉంటారో ఆలోచించుకుంటేనే భయమేస్తుంటుంది. వైఎస్ తాతే లేకపోతే నాకు ఆపరేషన్ జరిగేది కాదని నాన్న చెబుతూ ఉంటారు. ఇప్పుడు నాకు 15 సంవత్సరాలు. పదవ తరగతి చదువుకుంటున్నా. నాన్న, అమ్మ, ఇద్దరు తమ్ముళ్ళు, నాన్నమ్మ, తాతయ్యలతో హ్యాపీగా ఉన్నా. వైఎస్ తాతయ్య గురించి నాన్న చెప్పిన నాటి నుంచే ఆయనను దేవుడిగా కొలుస్తూ వస్తున్నా. ఆయన ఇప్పుడు మనతో ఉంటే బాగుండేదనిపిస్తోంది. నాకు ప్రాణభిక్ష పెట్టిన తాతయ్య ఎందుకు వదిలేసి పోయాడో! ఆయన లేడన్న బెంగ అలాగే మిగిలిపోయింది.

**- చెరుకూరి మేఘన, ఇబ్రహీంపట్నం, రంగారెడ్డి**

## ఆయనే లేకుంటే మా బతుకులెలా ఉండేవో!?



నేనొక చిన్న ఫొటో స్టూడియో నడుపుకుంటూ కుటుంబాన్ని పోషిస్తున్న. 2009లో ఒకటే ఛాతినొప్పి అనిపిస్తే ముందు హన్మకొండలో ఓ ప్రైవేటు హాస్పిటల్‌లో చేరిన. డాక్టర్లు హైద్రాబాద్‌కు రిఫర్ చేస్తే, మళ్ళ అక్కడ మెడిసెంటర్‌ల చేరిన. గుండెనొప్పి అని, దానికి బైపాస్ సర్జరీ చేయాల్సిందేనని డాక్టర్లు అన్నరు. దానికి 2లక్షలు ఖర్చయితదని చెప్పిర్రు. నా ప్రాణాలు పోతాయనుకున్న అప్పుడే. అయితే వైఎస్ ఆశాజ్యోతిలా ఆదుకున్నడు. ఆయన తీసుకొచ్చిన ఆరోగ్యశ్రీ కింద ఆపరేషన్ చేస్తమని పైసా ఖర్చు లేకుండా నన్ను బతికించిర్రు. ఆయన ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్ వల్లనే ఇప్పుడు నా కొడుకు బీటెక్ చదివి ఉద్యోగం చేస్తున్నడు. ఆయనే లేకుంటే మా ఈ బతుకులెలా ఉండేవో అనిపిస్తది.

**- కుడికాల సత్యనారాయణ, పరకాల, వరంగల్ రూరల్**





## వైఎస్ లేకపోతే సివిల్స్ కల సాకారమయ్యేది కాదు!

మా నాన్న పేరు రమణయ్య. ఆయనొక ఆటోడ్రైవర్. అమ్మ సరోజిని బీడీలు కడుతూ కష్టపడేది. నేను బాగా చదువుకోవాలని అమ్మ, నాన్న కలలు కన్నారు. చిన్నప్పట్నుంచే స్కూల్లో మంచి మార్కులతో పాస్ అవుతూ వచ్చా. ఇంట్లో ఆర్థికపరిస్థితి చూసి పాలిటెక్నిక్ చదివేరోజుల్లోనే ఇక పై చదువులు చదవగలనా అన్న భయం ఉండేది. వైఎస్సార్ ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్ నాకొక ఆశాదీపంలా కనిపించింది. ఆ పథకంవల్లే బీటెక్ పూర్తి చేసి సివిల్స్‌కు సిద్ధమయ్యా. ఈమధ్యే వచ్చిన ఫలితాల్లో సివిల్స్‌లో 526వ ర్యాంకర్‌గా నిలిచా. వైఎస్సార్ పథకమే లేకపోతే పాలిటెక్నిక్‌తోనే నా చదువు ఆగిపోయేది. నా కల ఎప్పటికీ నెరవేరేది కాదేమో. ఇప్పుడు మేమందరం సంతోషంగా ఉన్నామంటే అది వైఎస్సార్ చలవే!

- చెన్నూరి సర్వేష్, హసన్‌పర్తి, వరంగల్ అర్బన్



కూతురు మానసతో స్వరూప

## మా బిడ్డ బతికి బడి ముఖం చూసింది!

మాదొక పేద కుటుంబం. మాకు ఇద్దరు ఆడపిల్లలు. పెద్దమ్మాయి మానసకు చిన్నప్పటి నుంచే గుండె జబ్బు ఉండింది. బిడ్డ ఆరోగ్యం కోసమే ఉన్న భూములన్నీ అమ్మేసినం. అప్పులు చేసి మరీ డాక్టర్లకు చూపించినం. మానసకు గుండె జబ్బు ఉందని, ఆపరేషన్ చేస్తేనే నయమవుతదని డాక్టర్లు చెప్పిన్రు. మా దగ్గరిగ పైసల్లేక బిడ్డ ప్రాణాల మీద ఆశలు వదులుకున్నం. అప్పుడే వైఎస్. రాజశేఖరరెడ్డి దొర పెట్టిన ఆరోగ్యశ్రీ గురించి తెల్సింది. హైదరాబాద్‌లోని ఇన్నోవా ఆసుపత్రిల చేర్పిస్తే, రూపాయి తీసుకోకుండా ఖర్చంతా గవర్నమెంటే భరించి ఆపరేషన్ చేసింది. మందులు ఫ్రీగా ఇచ్చి, ఇంటికి పోతానికి బస్సు కిరాయిలు కూడా ఇచ్చి పంపిచ్చిన్రు. జబ్బుతో అసలు బడి ముఖమే చూడని మానస ఇప్పుడు రోజూ బడికి పోతోంది. ఆ రాజన్న దొరే లేకపోతే మా బిడ్డ బతక్కపోదువు. రోజూ ఆయన ఫోటోకు దండం పెట్టుకున్నాకే పనికి పోతం.

- కర్రె స్వరూప, బాన్సువాడ, నిజామాబాద్

## పిల్లల ఉన్నత చదువు ఆయన చలవే!



కుటుంబ సభ్యులతో ఫయాజ్‌బాషా

టైలర్ పనినే జీవనాధారంగా చేసుకొని బతుకుతున్న నాకు ముగ్గురు పిల్లలు. నసురుద్దీన్, నిజాముద్దీన్, రుక్సానా. పదో తరగతి వరకు ముగ్గురూ గవర్నమెంట్ స్కూల్లోనే చదువుకున్నారు. పిల్లలందరూ బాగా చదువుకోవాలన్నది నా కల. వాళ్ళు కూడా స్కూల్లో మంచి మార్కులతో పాసవుతూ రావడంతో ఇంటర్‌లో ప్రైవేటు కాలేజీల్లోనే ఫ్రీగా చదువుకున్నారు. అయితే ఆ తర్వాత పిల్లల పై చదువులు ఎలా అన్నది నాకొక భయంగా ఉండేది. నసురుద్దీన్, రుక్సానాలు మెడిసిన్ చదవాలనుకున్నారు. నిజాముద్దీన్ ఇంజనీర్ అవ్వాలనుకున్నాడు. వీళ్ళను ఇక పై చదువులు చదివించగలనా అనుకున్న సమయంలోనే నాటి ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డి ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకాన్ని ప్రవేశపెట్టారు. పేదరికంలో ఉన్న నేను నా పిల్లలను చదివించగలనా అన్న భయాలను తుడిచేస్తూ ఆయన తెచ్చిన ఈ పథకంతో నసురుద్దీన్‌ను కడప రిమ్స్‌లో హౌస్ సర్జన్ చదువుకొని ప్రస్తుతం కేరళలో డాక్టర్‌గా పనిచేస్తున్నాడు. పాప రుక్సానా ఇప్పుడు హోమియోపతి చదువుతోంది. నిజాముద్దీన్ ఇంజనీరింగ్ పూర్తి చేశాడు. ఈ పేదవాడి ఇంట్లో ఇప్పుడు ముగ్గురు పిల్లలు ఇప్పుడు ఉన్నతచదువులు చదువుకోగలిగారంటే అది వైఎస్సార్ గారి చలవే!

- షేక్ ఫయాజ్‌బాషా, బుచ్చిరెడ్డి పాలెం, నెల్లూరు

## ఆయననెలా మరచిపోగలం!



వికలాంగులకు అండగా నిలబడాలని వై.ఎస్.రాజశేఖరరెడ్డి గారు ప్రవేశపెట్టిన పింఛన్ పథకం కింద అప్పట్లోనే నెలనెలా 200 రూపాయలు వచ్చేవి. ముసలోళ్ళకు, భర్త చనిపోయినోళ్ళకు కూడా పింఛన్ వస్తోందంటే అది వైఎస్సార్ చలవే! వికలాంగుడిగా ప్రభుత్వం నుంచి వచ్చే పింఛన్ నాలో ధైర్యాన్నిచ్చింది. ఆయనను ఎప్పటికీ మరచిపోలేం!

- ఓర్సు నరసింహారావు, ముప్పాళ్ళ, గుంటూరు





కొడుకు ఏమస్వామితో లక్ష్మి

## పేదింట వెలుగు మా రాజన్న!

**మేం** పాలమ్ముకొని బతికేటోళ్ళం. మా బిడ్డ చిన్నగున్నప్పుడే బళ్ళో కరెంట్ షాక్ కొడితే చచ్చిపోయింది. ఆ బాధను మేం మరిచిపోక ముందే కొడుకు ఏమస్వామికి ఓసారి జబ్బు చేసింది. దవాఖానాకు తీసుకపోతే మందులు వాడితే తగ్గుతది అన్నరు. ఆ తర్వాత అది అట్ల పెరుగుతనే పోయి పెద్దగయింది. పదేళ్ళ పిలగాని బాధను చూసి తట్టుకోలేకపోయినం. మూడు నాలుగు చోట్ల చూపించినంక గుండెకు రంధ్రం పడ్డదని, ఆపరేషన్ చేయాలని చెప్పిర్రు. హైద్రాబాద్ తీస్కపోయి ఆరోగ్యశ్రీ కింద ఆపరేషన్ చేయించినం. మానించి రూపాయి తీస్కోకుండ 5లక్షల 40 వేల రూపాయలు సర్కారే కట్టింది. ఇప్పుడు ఏమస్వామి మూడో తరగతి చదువుతున్నడు. ఆడు ఇయ్యాల హుషారుగ తిరుగుతున్నడంటే అది రాజన్న దొర వల్లనే! మా పేదింట వెలుగు రాజన్న. ఆయనే లేకుంటే మా బిడ్డ బతుకు ఏమయ్యేనో!

**- లక్ష్మి, వేమనపల్లి, ఆదిలాబాద్**

## వైఎస్ మా జీవితాల్లో వెలుగు నింపారు!



**మా**దొక నిరుపేద కుటుంబం. నాన్న ఎంతో కష్టపడి నన్ను చదివించాలని కలలుగన్నాడు. అయితే నేను ఇంటర్ చదివే రోజుల్లోనే ఓ ప్రమాదంలో నాన్న చనిపోయాడు. అమ్మ ఇంటి బాధ్యతను మీద వేస్కొని నన్ను, తమ్ముడిని చదివించింది. టైలరింగ్ చేస్తూ, తను మాకోసం ఎంతో కష్టపడింది. నాకు ఇంటర్‌లో 952 మార్కులు రావడంతో పాటు, ఇంజనీరింగ్‌లో 6354 ర్యాంక్ వచ్చింది. మంచి కాలేజీలో ఇంజనీరింగ్ సీట్ వస్తుందని తెలిసినా, అంత స్థోమత లేదని డిగ్రీ చేద్దామనుకున్నా. అదే సమయంలో అలనాటి ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డి గారు ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకాన్ని ప్రవేశపెట్టారు. అదే నా జీవితాన్ని మలుపుతిప్పింది. ఫీజు రీయింబర్స్‌మెంట్‌తో ఉచితంగా ఇంజనీరింగ్ చేశా. టీఎస్‌పీఎస్సీ ఇంజనీరింగ్ పోస్టులు పడితే, పంచాయతీ రాజ్ శాఖలో ఇంజనీర్‌గా ఉద్యోగం వచ్చింది. వైఎస్సార్ వల్లే నాతో పాటు వేలాది మంది పై చదువులు చదువుకుంటున్నారని నిస్సందేహంగా చెప్పగలను. మా జీవితాల్లో వెలుగు నింపిన దేవుడు వైఎస్సార్.

**- మైనంపాటి దేవేందర్ రెడ్డి, మిర్యాలగూడ రూరల్, నల్లగొండ**

## నీడ, ధైర్యాన్నిచ్చాడు వై.ఎస్..!

**నే**నొక వికలాంగురాలిని. నా భర్త చంద్రన్నకు రెండు కళ్ళూ కనిపించవు. చిన్న చిన్న పనులు చేసుకుంటూ బతికేడుస్తున్న మాకు సెంటు భూమి కూడా లేదు. అలాంటి మాకు ఇందిరమ్మ ఇల్లు పథకం కింద స్థలం ఇవ్వడంతో పాటు ప్రభుత్వమే ఇల్లు కూడా కట్టించి ఇచ్చింది. వై.ఎస్.రాజశేఖరరెడ్డి పుణ్యాన ఇప్పుడు మేము సొంత ఇంట్లో ఉంటున్నాం. రాజన్నే పెట్టిన పింఛన్ పథకం కింద కూడా నెలనెలా మా ఇద్దరికీ పింఛన్ వస్తోంది. పేదల మనసెరిగిన రాజు వై.ఎస్.ఆర్. ఆయన దయతోనే మాకిప్పుడు ఓ నీడ ఉంది, బతుకు మీద ధైర్యం వచ్చింది.

**- తిమ్మక్క, కెంచంపల్లి, అనంతపురం**

## మా ఇంట్ల పెద్ద కొడుకు వైఎస్సారే!

**వ్య**వసాయమొక్కటే మాకు తెలిసిన పని. ఉన్న మూడెకరాల్ల బోరుబావులు ఎండిపోయి ఒక్క ఎకరం కూడ సక్కగ సాగయ్యేది కాదు. అయినా అదే పని చేస్కుంట బతుకుత వచ్చినం. మాకు ఇద్దరు ఆడపిల్లలు. 'మగపిల్లలు లేకపాయే.. ఉన్న ఇద్దరూ ఆడపిల్లలేనాయే' అని చానామంది అంటుండే! ఆడపిల్లలైనా ఆళ్ళను బాగా సదివించాలని బలంగ అనుకున్నం. పెద్దమ్మాయి రాధిక చిన్నప్పటి సంది ఫస్ట్ వచ్చేది. పదో తరగతిలో మంచి మార్కులు తెచ్చుకుంటే బాసర ట్రిపుల్‌ఐటీల ఫ్రీ సీట్ వచ్చింది. వైఎస్సార్ దయ వల్ల రాధిక ట్రిపుల్‌ఐటీలనే ఇంజనీరింగ్ చదివింది. మా బంధువుల్లో ఫస్ట్ ఇంజనీరింగ్ దాంక చదివింది రాధికే! ఇట్ల సదువు అయిపోంగనే గవర్నమెంట్ ఇంజనీర్‌గా జాబొచ్చింది. మిడ్‌మానేరు ప్రాజెక్టు ఏఈఈగా పనిచేస్తుందిప్పుడు. వైఎస్సార్ ఫ్రీగా చదివించాలనే అనుకోకుంటె మా ఇంట్ల ఇంజనీర్ పుట్టేది కాదు. మగపిల్లలు లేని మా ఇంట్ల వైఎస్సారే పెద్ద కొడుకై చెల్లెళ్ళను చదివించిండని చెప్పుకుంటూంటా. పేదల మనసెరిగిన మనసున్న మారాజు వైఎస్సార్.

**- దేవేంద్ర, ముస్తాబాద్, కరీంనగర్**



కూతురు రాధికతో దేవేంద్ర

## వైఎస్సార్ వల్లే బాబు బతికాడు!



శ్రీను

**మా** అబ్బాయి శ్రీనుకు చిన్నతనంలోనే గుండె జబ్బు వచ్చింది. ఆరో తరగతి చదివే రోజుల్లో తరచూ ఆయాసంతో ఇబ్బంది పడేవాడు. పెదాలంతా నీలం రంగులోకి మారేవి. నడవలేక ఇబ్బంది పడేవాడు. ఆస్పత్రిలో చూయిస్తే గుండెకు రంధ్రాలు పడ్డాయని, ఆపరేషన్ చేస్తేనే బతుకుతాడని, దానికి 2లక్షల దాకా ఖర్చవుతుందని చెప్పారు. రెక్కాడితే గానీ డొక్కాడని బతుకులు మావి. ఏమీ చేయలేమని చెప్పి వదిలేశాం. ఒకటిరెండు సార్లు పుట్టపర్తికి తీసుకెళ్ళినా అక్కడా ఆపరేషన్ చేయలేదు. ఇక చేసేదేం లేక బాబుకు జబ్బు చేసి నీరసపడ్డప్పుడల్లా మందులు వాడేవాళ్ళం. వాడి అవస్థ చూసి చెప్పుకోలేనంత బాధపడేవాళ్ళం. 2011లో ఉమబాల అనే ఓ టీచర్ వైఎస్సార్ గారు ప్రవేశపెట్టిన ఆరోగ్యశ్రీ గురించి చెప్పి విశాఖలోని అపోలో ఆసుపత్రికి తీసుకెళ్ళారు. అక్కడ పైసా ఖర్చు లేకుండా ఆరోగ్యశ్రీ ద్వారా బాబుకు నయం చేశారు. ఇప్పుడు శ్రీను ఇంటర్ చదువుకుంటున్నాడు. ఇప్పుడు వాడు ఆరోగ్యంగా నవ్వుతూ ఉంటే వైఎస్సారే గుర్తొస్తారు. ఆయన ఆరోగ్యశ్రీ వల్లే బాబు బతికాడు.

**- సూరాకాసుల అనురాధ, పాయకరావు పేట, విశాఖపట్నం**

## బతికినన్ని రోజులు ఆయనను గుండెల్లో పెట్టుకుంటా!

**నే**ను నాగళ్ళు, మంచాలు, తలుపులు చేసుకుంటూ వడ్లపనితో నా కుటుంబాన్ని పోషించుకుంటున్న వాడిని. 2008లో ఓరోజు పని చేస్తుండగా ఒక్కసారిగా గుండెనొప్పి వచ్చింది. నిలబడ్డ కాడనే కింద పడిపోయిన. చుట్టూ ఉన్నోళ్ళు చూసి దవాఖానాల చేర్పిచ్చిర్రు. హైద్రాబాద్‌కి తీస్కపోవాలి తప్పదు అంటే దుర్గాభాయ్ దేశ్‌ముఖ్ హాస్పిటల్‌ల చేర్పిచ్చిర్రు. డాక్టర్లు మందులిస్తే రెండు రోజులు బానే కోలుకున్న. ఆపరేషన్ చేస్తెనె సెట్ అయితది లేదంటే ప్రాణాలే పోవొచ్చు అన్నరు. అక్కడ ఇక్కడ అడుక్కొచ్చిన పైసలు గుడ అప్పటికే అయిపోయినయి. ప్రాణాలు పోతయనే అనుకున్న. అప్పుడే ఓ పెద్దమనిషి వైఎస్ రాజశేఖరరెడ్డి పథకం ఆరోగ్యశ్రీ గురించి చెప్పిండు. కానీ మాకప్పటికి ఆ కార్డు లేదు. ఏమైన కానీ అని రాజశేఖరరెడ్డి సార్ ఉండె క్యాంప్ ఆఫీస్‌కు పోయినం. నా బాధంతా చెప్పుకొని ఆయన కాళ్ళ మీద పడబోతుంటే, ఆయన నన్ను లేపి, ''ఏం కాదు. నేను చూస్కుంటా! కార్డు లేకున్నా ఆరోగ్యశ్రీ పథకం కింద నీకు ఆపరేషన్ చేయించే బాధ్యత నాది'' అన్నరు. అధికారులకు చెప్పించి నా ఆపరేషన్ చేయించిర్రు. 15రోజులు హాస్పిటల్‌లనే ఉంచుకున్నరు. నాతోని వచ్చినోళ్ళకు కూడ అన్నం పెట్టిర్రు. పోయేరోజు దారి ఖర్చులు కూడ ఇచ్చిర్రు. ఆ దేవుడు వైఎస్సారే లేకపోతే నేను ఆపరేషన్ చేయించుకునేటోన్ని కాదు. బతికేటోడ్ని కూడా కాదు. నన్ను బతికించి, ఆయన పోయాడు. నేను బతికినన్ని రోజులు ఆయనను గుండెల్లో పెట్టుకుంటా.



**- వెయిగండ్ల సుధాకర్, జన్నారం, ఆదిలాబాద్**

## వైఎస్ పథకం వల్లే డ్రగ్ ఇన్‌స్పెక్టర్ కాగలిగా!

**మా**కున్న చిన్న పొలంలో ఏటా ఒక్క పంటే పండేది. దాంతోనే కష్టపడి అమ్మా, నాన్నా వ్యవసాయం చేస్తూ నన్ను చదివిస్తూ వచ్చారు. ఇంటర్ తర్వాత పై చదువులు చదవాలన్న ఆలోచన ఉన్నా, అందుకు ఆర్థిక పరిస్థితి సహకరించదని అనుకుంటూ ఉండేవాడ్ని. అదే సమయంలో నాటి ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డి గారు 'ఫీ వైవర్' పేరుతో పేద విద్యార్థుల చదువుల కోసం ఒక పథకం ప్రారంభించారు. ఎంసెట్‌లో మంచి ర్యాంకు రావడంతో ఆ పథకం కింద నాకు బీ ఫార్మసీ ఫ్రీ సీట్ వచ్చింది. ఇక ఆ తర్వాతి సంవత్సరం నుంచి ఫీజు రీయింబర్స్‌మెంట్ పేరుతో అందరికీ వర్తించేలా పథకం చేపట్టడంతో నా చదువంతా సాఫీగా సాగిపోయింది. ఆ తర్వాత చండీఘడ్‌లో ఎంఫార్మసీ చదువుతున్న రోజుల్లోనే డ్రగ్ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగం వచ్చింది. ప్రస్తుతం రాజమహేంద్రవరంలో బాధ్యతలు నిర్వహిస్తున్నా. వైఎస్ లాంటి ఆలోచనలున్న నాయకుడు ఉంటే ఉన్నత చదువులు పేదవాడికీ సాధ్యమే! నాతోపాటు ఎంతో మందికి ఉన్నత విద్యను అందించిన వైఎస్ గారికి థ్యాంక్స్ ఎంత చెప్పినా తక్కువే!



**- బి.గోపాలకృష్ణ, తెనాలి, గుంటూరు**

## రాజన్నే లేకపోతే నా కుటుంబం అనాథగా మిగిలేది!!

నేనొక చేనేత కార్మికుడిని. శాయంపేటలో మాకు పెద్దగ పనుల్లేకుంటే భీవండి వలస వెళ్ళిన. ఆ తర్వాత అట్లనే వలస పోయి అక్కడక్కడ పనిచేసిన. మళ్ళా అక్కడుంటే ఇంటికి దూరమైన అనిపించి ఊరికి దగ్గర్లనే ఓ కోళ్ల ఫారంల పనికి చేరిన. 2011ల ఓరోజు పనిల ఉన్నప్పుడె గుండెపోటు వచ్చింది. హైద్రాబాద్‌ల కేర్ హాస్పిటల్‌ల చేర్పిచ్చిన్రు. ఆరోగ్యశ్రీ కింద రూపాయి ఖర్చు లేకుండ ఆపరేషన్ చేసి పంపిచ్చిన్రు. ఆ రోజు రాజన్నే లేకపోతే నా కుటుంబం అనాథగ మిగిలేది. వైఎస్ ఉన్న రోజుల్లోనే నాకు ఇందిరమ్మ ఇల్లు గూడ మంజూరు చేసిన్రు కానీ ఆయన పోయినంక అది సగంలనే ఆగిపోయింది. ఇప్పుడైతే బీడీలు కట్టుకుంట పిల్లలను సాదుతున్న. వైఎస్ వల్లనే బతికి బట్ట గట్టిన అని చెప్పి ఆయనను దేవుడుగ కొలుసుకుంటున్న.

**- సామల మల్లేశం, వరంగల్‌రూరల్**

## నా బిడ్డను బతికించింది ఆయనే!

కూతురు శ్రీదేవితో గోవిందు

మాది నిరుపేద కుటుంబం. బతుకు గడవడమే కష్టంగా ఉన్న రోజుల్లో నా బిడ్డ శ్రీదేవి చెవికి ఓ ప్రమాదంలో తీవ్రంగా గాయమైంది. కాకినాడ గవర్నమెంట్ ఆసుపత్రికి తీసుకెళ్తే అక్కడ డాక్టర్లు మావల్ల కాదని చెప్పేశారు. హైద్రాబాద్‌కు పోవాలంటే అంత డబ్బు లేదు. బిడ్డకేమో చెవి నుంచి చీము కారుతూ వచ్చింది. పూర్తిగా జబ్బు చేసింది. అప్పుడే వైఎస్సార్ గారు ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్ గురించి తెలిసి హైద్రాబాద్‌లోని నిమ్స్‌లో అమ్మాయిని జాయిన్ చేశాం. ఒక్కరూపాయి తీసుకోకుండా ఆపరేషన్ చేసి నయం చేశారు. ఇప్పుడు శ్రీదేవి తనంతట తానుగా ఓ షాపులో పనిచేసుకొని ఆరోగ్యంగా బతుకుతోంది. నా బిడ్డను బతికించిన వైఎస్సార్‌ను ఎప్పటికీ మరచిపోలేము.

**- బాదిరెడ్డి గోవిందు, బిక్కవోలు, తూర్పు గోదావరి**

## మా ఇంటి పేరు వైఎస్ రాజశేఖరరెడ్డి

మాది నిరుపేద కుటుంబం. సొంత ఇల్లు కూడా లేదు. ఏ తల్లిదండ్రులకైనా తమ పిల్లలు ఎంతో ఎత్తుకు ఎదగాలని, ఉన్నతంగా స్థిరపడాలి అనే కోరిక ఉంటుంది. కాని ఆర్థిక కష్టాలు ఈ కోరిక మీద నీళ్లు చల్లుతాయి. ఆర్థిక పరిస్థితులు అనుకూలించక, చదువును మధ్యలోనే ఆపేసి తమ పెద్దలు చేసే వృత్తిలోనే స్థిరపడి రాజీపడుతున్న పేదింటి పిల్లలకు వైఎస్‌గారు ఉన్నత జీవితాలను ప్రసాదించారు. ఆయన ప్రవేశ పెట్టిన ఫీజు రీయింబర్సుమెంట్ పథకం ద్వారా 2008-12 విద్యాసంవత్సరంలో బీ.టెక్ పూర్తిచేసుకున్న నేను ఈరోజు బెంగుళూరులో హెచ్‌పీ సాఫ్ట్‌వేర్ సొల్యూషన్ కంపెనీలో సంవత్సరానికి 7 లక్షల ప్యాకేజీతో ఉద్యోగం చేస్తున్నాను. మా అమ్మ కృష్ణవేణి కోరిక ప్రకారం సొంత ఇల్లు కట్టుకొని, దానికి ఇంతటి జీవితాన్ని ఇచ్చిన 'డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి నిలయం'గా పేరు పెట్టుకుంటాం.

**- దొమ్మేటి సతీష్, ద్రాక్షారామం, రామచంద్రపురం, తూర్పుగోదావరి**

## రాజన్న చలువతోనే మా ఇంట ప్రభుత్వ ఉద్యోగి!

మాదొక పేద కుటుంబం. మా వంశంలో ప్రభుత్వ ఉద్యోగులెవ్వరూ లేరు. అందరం వ్యవసాయం చేసుకొనే బతుకుతున్న వాళ్ళం. 2004లో ఓ రోడ్డు ప్రమాదంలో మా అన్న చనిపోయాడు. దాంతో ఆయన కొడుకు మహమ్మద్ రఫీని చదివించే బాధ్యతను తీసుకున్నాం. ఇంటర్ వరకూ ఎలాగోలా చదివించినా, పై చదువులకు వచ్చేసరికి మావల్ల కాదేమో అనిపించింది. ఉమ్మడి కుటుంబం సమస్యలు ఎలా ఉంటాయో చెప్పక్కర్లేదు. అప్పుడే వై.ఎస్.రాజశేఖరరెడ్డి గారు ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్‌తో రఫీ ఉచితంగానే ఇంజనీరింగ్ చేశాడు. ఆ తర్వాత 2011లో ఎస్ఐ జాబ్‌కు కూడా ఎంపికయ్యాడు. ముస్లిం రిజర్వేషన్ వల్లే రఫీకి ఎస్ఐ ఉద్యోగం వచ్చింది. ఈ పేద కుటుంబంలో ఇప్పుడొక ప్రభుత్వ ఉద్యోగి ఉన్నాడంటే అది వైఎస్ చలవే! ఆయన మేలును జీవితంలో మరిచిపోలేము. పేదవాడికి అన్నం పెట్టే ఆలోచనలున్న వై.ఎస్. లాంటి నాయకుడే రాష్ట్రానికి అవసరం.

**- సలీం బాషా, పాలకుర్తి, కర్నూలు**

## ఫీజు రీయింబర్స్‌మెంట్ వల్లే ఉన్నత చదువులు చదివాం!



మాదొక సాధారణ మధ్య తరగతి కుటుంబం. మేము ముగ్గురం అక్కా చెల్లెళ్ళం. మేమంతా బాగా చదువుకొని మంచి స్థాయికి రావాలని అమ్మ, నాన్నలు ఎంతో కష్టపడి చదివిస్తూ వచ్చారు. చిన్న హోటల్ నడుపుకుంటూ మా ముగ్గురికీ ఏ లోటూ రాకుండా అమ్మా నాన్న చూసుకుంటూ వచ్చినా, పెద్ద దానినైన నేను పై చదువులకు వచ్చేసరికి స్థోమత సరిపోలేదు. తప్పని పరిస్థితుల్లో చదువు మానేద్దామనే ఆలోచనకు వెళ్ళిపోయా. అప్పుడే నాటి ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డి గారు ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకాన్ని తీసుకొచ్చారు. చదువు ఆపేద్దామనుకున్న నాకు వైఎస్సార్ నిర్ణయంతో ఉత్సాహం వచ్చింది. ప్రభుత్వ ఖర్చులతో ఉచితంగా ఎంఫార్మసీ వరకు చదివా. వెంటనే నాట్కో కంపెనీలో పెద్ద ఉద్యోగం వచ్చింది. నాకు ఉద్యోగం రావడంతో ఇప్పుడు అమ్మా నాన్నలకు అండగా నిలబడుతున్నా. అదేవిధంగా చెల్లెళ్లిద్దరూ కూడా ఉన్నత చదువులు చదువుతున్నారు. ఫీజు రీయింబర్స్‌మెంట్ వల్లే మేము ఉన్నత చదువులు చదవగలిగాం.

**- బండారు భాగ్యశ్రీ,త్రిపురారం, నల్లగొండ**

## వైఎస్ లేకపోతే బాబు మాట్లాడేవాడే కాదు!





నరేంద్రబాబు

నేను బార్బర్‌గా పని చేసుకుంటూ బతుకీడుస్తున్న వాడిని. నాకు ఇద్దరు కూతుళ్ళు, ఒక కొడుకు. కొడుకు నరేంద్రబాబు పుట్టుకతోనే చెవిటి, మూగ. రెండేళ్ళ తర్వాత ఈ విషయం తెలుసుకున్న మేము అప్పట్లో కర్నూలులో డాక్టర్లకు చూపిస్తే బెంగళూరు పంపించారు. బెంగళూరులో కాదని స్పీచ్ థెరపీ కోసం హైదరాబాద్ పంపించారు. హైదరాబాద్‌లో వాడికోసం రెండేళ్ళున్నాం. ఈ రెండేళ్ళలో బాబులో కొద్దిగా మార్పొచ్చింది. మెల్లి మెల్లిగా మాట్లాడ్డం మొదలుపెట్టాడు. ఇక అదే టైమ్‌కు ఆరోగ్యశ్రీ కింద బాబుకు నయం అవ్వడానికి ఫ్రీగా ఆపరేషన్ చేస్తారని తెలిసింది. అయితే మా వాడికి ఆరేళ్ళు నిండడంతో ఆరోగ్యశ్రీ వర్తించదు అన్నారు. మేము వెళ్ళి ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డి గారిని కలిస్తే, ఆయన సాయం చేస్తామన్నారు. ఆ తర్వాత 2009లో ఈ ఆపరేషన్ మా వాడికి కూడా చేసేలా ఆరోగ్యశ్రీలో మార్పులు చేశారు. 8 లక్షల వరకూ ఖర్చయ్యే ఆపరేషన్ ఉచితంగా జరిగింది. ఇప్పుడు బాబు చక్కగా మాట్లాడుతున్నాడు. ఇంటర్ చదువుతున్నాడు. వైఎస్ స్పందించకపోయి ఉంటే మా బాబు మాట్లాడేవాడే కాదు!

**- నాగరాజు, కర్నూలు**



కొడుకు సత్యమణిదీప్‌తో సూర్యనారాయణ

## ఆయన మేలు మరవలేము...

నేను గాంధీ చౌక్‌లో మోటార్ రిపేరింగ్ చేస్తూ కుటుంబాన్ని పోషిస్తూ వస్తున్నా. సత్యమణిదీప్ మా ఏకైక సంతానం. మా వాడికి చిన్నతనం నుంచే వినికిడి లోపం ఉండడంతో మాట్లాడలేకపోయేవాడు. వాడికి నయం చేయాలని చాలా ఆసుపత్రులు తిప్పాం కానీ మా దగ్గర అంత డబ్బు లేక ఇక వదిలేశాం. అప్పుడే వైఎస్ రాజశేఖరరెడ్డి ప్రవేశపెట్టిన ఆరోగ్యశ్రీ గురించి తెలిసి ఆపరేషన్ చేయిద్దామని హైదరాబాద్‌కు వచ్చాం. అయితే ఆ ఆపరేషన్‌కు 6లక్షల దాకా ఖర్చవుతుందని, ఆరోగ్యశ్రీ కింద అంత మొత్తం ప్రభుత్వం ఇవ్వదని డాక్టర్లు చెప్పారు. దీంతో మేమే స్వయంగా వెళ్ళి వైఎస్సార్‌ను కలసి మా గురించి చెప్పాం. ఆరోగ్యశ్రీ ద్వారా వచ్చే మొత్తానికి ఇంకెంత ఎక్కువ ఖర్చు అయినా సీఎం రిలీఫ్ ఫండ్ నుంచి ఇస్తామని ధైర్యమిచ్చారు. దాంతో ఆపరేషన్ జరిగి బాబుకు నయం అయింది. ఇప్పుడు వాడు ఆరోగ్యంగా ఉండడంతో పాటు ఓ ప్రైవేటు కాలేజీలో ఉద్యోగం కూడా చేస్తున్నాడు. మా వాడికి నయం చేయడంతో పాటు, వాడు స్థిరపడేలా చేసిన వైఎస్సార్‌ను ఎప్పటికీ మరచిపోలేము. వైఎస్సార్ తనయుడు వైఎస్ జగన్‌ను కలసి కృతజ్ఞతలు చెప్పాలని ఎప్పట్నుంచో అనుకుంటున్నా.

**- ఘంటశాల సూర్యనారాయణ, సామర్లకోట, తూర్పు గోదావరి**







## ప్రతిరోజూ ఆ దేవుడ్ని కొలుస్తూంటా!

నేను రోజూవారీ కూలీ పని చేసుకొని బతికే పేదవాడిని. ఆ వచ్చే ఎంతో కొంత డబ్బుతోనే కుటుంబాన్ని పోషిస్తూ వచ్చా. 2008లో ఓసారి నాకు జబ్బు చేసింది. ఆసుపత్రిలో చేరితే కొన్ని మందులిచ్చి తగ్గిపోతుందన్నారు. ఏడాది పాటు ఆ మందులు వాడా. జబ్బు తగ్గకపోగా ఎక్కువైపోయింది. అప్పుడే ఓ పెద్దాసుపత్రికి వెళితే, గుండెలో రంధ్రాలు పడ్డాయని, అన్ని ఖర్చులు కలిపి 5 లక్షలు అవుతాయని చెప్పారు. నా దగ్గర అంత డబ్బు ఉండే అవకాశమే లేదు. ఇక ప్రాణాల మీద ఆశ వదులుకున్నా. అప్పుడే వైఎస్ రాజశేఖరరెడ్డి పథకం ఆరోగ్యశ్రీ గురించి తెలిసింది. ప్రాణం మీద మళ్ళీ ఆశ పుట్టింది. వెంటనే అపోలో ఆసుపత్రిలో చేరా. ఆరోగ్యశ్రీ ద్వారానే మొత్తం ఆపరేషన్ జరిగిపోయింది. సంవత్సరానికి సరిపడా మందులు కూడా ఉచితంగా ఇచ్చారు. ఆసుపత్రి నుంచి వెళ్ళేరోజు ఆటో ఖర్చులు కూడా ఇచ్చి పంపడం ఇప్పటికీ మర్చిపోలేను. ఆ దేవుడు వైఎస్సే లేకపోతే నేను ఆరోజే ప్రాణాలు వదిలేవాడిని. ఇప్పుడు నా కొడుకు కూడా ఫీజు రీయింబర్స్‌మెంట్ ద్వారా చదువుకొని, ప్రైవేటు ఉద్యోగం చేస్తున్నాడు. వైఎస్ ఇప్పుడు మన మధ్య లేకపోవడం తీర్చలేని లోటు. ప్రతిరోజూ ఉదయాన్నే ఆయనను తలుచుకున్నాకే రోజు మొదలుపెడతా.

**- ఉరిటి మనోహర్, ఆరిలోవ, విశాఖపట్నం**

## నన్ను బతికించిన వైఎస్‌కు ఎప్పటికీ రుణపడి ఉంటా!



నేను టైలరింగ్ చేసుకుంటూ కుటుంబాన్ని పోషిస్తున్నా. మాకు ముగ్గురు ఆడపిల్లలు. ఉన్నంతలో వాళ్ళను చదివించుకుంటూ, కుటుంబాన్ని నెట్టు కొస్తున్న నాకు 2008లో ఓరోజు గుండెపోటు వచ్చింది. బతుకుతననే నమ్మకం కూడ లేకుండే. ఆపరేషన్ చేస్తనే బతుకుతనన్నరు. చేతిల చిల్లిగవ్వ లేకుంటే ప్రాణం మీద ఆశలొదిలేసుకున్న. అప్పుడే వైఎస్ రాజశేఖరరెడ్డి పెట్టిన ఆరోగ్యశ్రీ గురించి తెల్సింది. ఫ్రీగ ఆపరేషన్ చేస్తరని విని హైద్రాబాద్‌ల గ్లోబల్ హాస్పిటల్‌ల చేరిన. ఆపరేషన్ చేసి పదకొండు రోజులు హాస్పిటల్‌లనే ఉంచుకున్నరు. నయమయినంక రూపాయి తీసుకోకుండ ఇంటికి పంపిచ్చిన్రు. వైఎస్సే లేకుంటే నేనేమౌనో!? నా ముగ్గురు ఆడపిల్లల పరిస్థితి ఎట్లుండునో!? నన్ను బతికించిన ఆ దేవుడికి ఎప్పటికీ రుణపడి ఉంటా!

**- ఎండీ జహంగీర్, రాజ్‌పల్లి, మెదక్**

## మా ఇద్దరి ప్రాణాలూ ఆయనవల్లే నిలిచాయ్!





ఆరేళ్ళ క్రితం నేనొక రోడ్డు ప్రమాదానికి గురయ్యా. అదే సమయంలో అక్కడే ఉన్న ఎవరో 108కు కాల్ చేయగా కొద్దిసేపట్లోనే అంబులెన్స్ వచ్చింది. అప్పటికే చాలా రక్తమే పోయినా, అంబులెన్స్‌లో ఏమాత్రం ఆలస్యం చేయకుండా విజయవాడలోని పెద్దాసుపత్రికి తీసుకెళ్ళారు. సమయానికి తీసుకురావడంతో ప్రాణాలతో కాపాడగలిగామని డాక్టర్లు చెప్పినపుడు 108 ఎంతగా ఉపయోగపడిందో అర్థమైంది. వైఎస్సార్ తీసుకొచ్చిన 108 నా ప్రాణాలు నిలబెడితే నా భార్య సీతమ్మ ప్రాణాన్ని ఆరోగ్యశ్రీ నిలబెట్టింది. 2.50 లక్షల విలువ చేసే వైద్యాన్ని సీతమ్మకు ఉచితంగా అందించారు. వైఎస్సార్ పథకాల వల్లే మా ఇద్దరి ప్రాణాలు నిలిచాయ్! ఇదంతా ఆయన చలవే!!

**- చవడం నాగేశ్వరరావు, నందిగామ, విజయవాడ**

## వైఎస్ వల్లే ఈ స్థాయికొచ్చా!



మాదొక పేద రైతు కుటుంబం. నాన్న వ్యవసాయ కూలీగా పనిచేస్తూ నన్ను చదివించారు. ఇంటర్ తర్వాత పైచదువులు మావల్ల కాదనుకున్న సమయంలోనే నాటి ముఖ్యమంత్రి వై.ఎస్.రాజశేఖరరెడ్డి గారు ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం అండగా నిలబడింది. ఉచితంగా ఉన్నత చదువులు పూర్తి చేసుకున్న నేను, చదువవ్వగానే కెనరా బ్యాంకులో ఉద్యోగం సంపాదించా. ప్రస్తుతం నల్లగొండ జిల్లా కెనరా బ్యాంకు శాఖలో పీవోగా పనిచేస్తున్నా. వైఎస్సార్ ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకమే లేకపోతే, ఉన్నత చదువు చదివి ఉద్యోగం సాధించేవాడిని కాదేమో. మాలాంటి ఎందరో పేద విద్యార్థులకు దారి చూపిన నాయకుడు వైఎస్సార్.

**- కట్టా సునీల్, బోడవాడ, వీరులపాడు మండలం, కృష్ణా**



## నిలువనీడ ఇచ్చారు

మహానేత వైఎస్ రాజశేఖరరెడ్డి గారి దయవల్లనే మాకు నిలువనీడ దొరికింది. ఆయన ముఖ్యమంత్రి అయిన రెండేళ్లకే సొంత ఇల్లు వచ్చింది. నా భర్త చనిపోయినా ధైర్యంగా బతుకు సాగిస్తున్నానంటే దానికి కారణం ఈ ఇల్లే. ఆయన ఈ ఇల్లు ఇవ్వకుంటే నేను, నా పిల్లలు ఎలా బతికేవాళ్లమో తలచుకుంటేనే భయమేస్తుంది. ఈ రోజుల్లో ఇల్లు కట్టుకోవాలంటే నాలాంటి పేదలకు కష్టమే. దిక్కుతోచని పరిస్థితుల్లో ఉన్న మాకు నిలువనీడ కల్పించిన వైఎస్ గారికి నేను, నా పిల్లలు ఎల్లవేళలా రుణపడి ఉంటాం.

- కొడుకుతో నాగమల్లి రేణుక,
వెంకటాపురం పంచాయతీ, ఏలూరు రూరల్ మండలం, పశ్చిమగోదావరి

## ఆ పథకాలు మా కుటుంబాన్ని నిలబెట్టాయి

సామాన్య కుటుంబం మాది. నా ఆదాయంతో ఇల్లు గడవడమే కష్టంగా ఉండేది. అలాంటి సమయంలో నాకు గుండెపోటు వచ్చింది. హైదరాబాద్‌లోని ప్రైవేటు ఆస్పత్రికి వెళితే స్టెంట్ వేయాలని చెప్పారు. దానికి లక్షన్నర వరకు ఖర్చవుతుందన్నారు. అంత డబ్బు ఎక్కడ తేవాలో అర్థం కాలేదు. మా బంధుమిత్రులెవరూ అంత డబ్బు ఇవ్వగలిగిన స్థితిలో లేరు. ఎప్పుడు ఏమవుతుందోనని దినదినగండంగా కాలం వెళ్లదీసేవాణ్ని. ఈలోగా వైఎస్ రాజశేఖరరెడ్డి గారు ఆరోగ్యశ్రీ పథకాన్ని ప్రవేశపెట్టారు. ఆరోగ్యశ్రీ కార్డు దొరికాక హైదరాబాద్‌లోని నిమ్స్‌కు వెళ్లాను. అక్కడి డాక్టర్లు వెంటనే నన్ను చేర్చుకుని స్టెంట్ వేశారు. కోలుకునే వరకు ఉచితంగా చికిత్స చేశారు.



మందులు కూడా ఉచితంగా ఇచ్చారు. నేను పూర్తిగా కోలుకుని కుటుంబంతో సంతోషంగా గడుపుతున్నాను. ఇక వైఎస్ గారు ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం పుణ్యాన నా కొడుకు సత్యనారాయణ ఇంజనీరింగ్ చదువుకోగలిగాడు. ఇప్పుడు తను హైటెక్ సిటీలో ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీలో ఉద్యోగం చేసుకుంటున్నాడు. వైఎస్ గారి పథకాలు మా కుటుంబాన్ని నిలబెట్టాయి.

- బోయిని ఈశ్వర్, ఖస్లకోహీర్,
జహీరాబాద్ మండలం, సంగారెడ్డి

## ఫీజు రీయింబర్స్‌మెంట్ వల్లే నిలదొక్కుకున్నా!



రజక కుల వృత్తినే నమ్ముకున్న కుటుంబం మాది. రెండు ఎకరాల భూమి ఉన్నా అది వ్యవసాయానికి పనికొచ్చేది కాకపోవడంతో కులవృత్తిపైనే ఆధారపడి నాన్న నన్ను చదివించాడు. డిగ్రీ వరకు స్కాలర్‌షిప్స్‌తో చదువుకుంటూ వచ్చినా, బీఈడీ చేసేందుకు మాత్రం ఆర్థిక పరిస్థితి సహకరించలేదు. దీంతో బీఈడీ చదవాలన్న నా కోరికను పక్కనపెట్టేశా. అప్పుడే నాటి ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డి గారు ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకాన్ని ప్రవేశపెట్టడంతో బీఈడీ చదువుకున్నా. ఆ తర్వాత 2006లో డీఎస్సీ రాసి ప్రభుత్వ ఉద్యోగం సంపాదించా. ఒక పేద కుటుంబం నుంచి వచ్చిన నేను ఇప్పుడొక ప్రభుత్వ ఉపాధ్యాయుడిగా ఎదిగానంటే అదంతా వైఎస్సార్ వల్లే!

- వర్సుపల్లి నర్సింలు, వెల్దుర్తి, మెదక్

## అవ్వతోడు.. ఆరోగ్యశ్రీ లేకుంటే బతికేటోన్నే కాదు!



ఇప్పుడు నేనిట్ల బతికి బట్టకట్టి మాట్లాడుతున్ననంటే ఆ పుణ్యం రాజశేఖరయ్యదే! నేను, మా రాజవ్వ కలిసి కూలీ పనిచేస్కోని బతికేటోళ్లం. ఉన్న ఒక్క బిడ్డకు పెండ్లి జేసినం. సెంటు భూమి లేదు మాకాడ. ఉన్నంతల మా పనేదో మేం చేస్కోని బతికే నాకు ఓ ఐదేళ్ల కింద గుండెపోటొచ్చింది. అంబులెన్స్‌కి ఫోన్ చేసి ఊళ్లోళ్లు కరీంనగర్ దవాఖానాకు తీస్కపోయిన్రు. అక్కడ మా వల్ల కాదని డాక్టర్లు అంటే హైదరాబాద్‌కు తీస్కపోయిన్రు. అపోలో హాస్పిటల్ల గుండె ఆపరేషన్ చేసి మాకానించి రూపాయి కూడ తీస్కోలేదు. రాజశేఖరయ్య పెట్టిన ఆ ఆరోగ్యశ్రీ వల్లనే రెండు లక్షల ఆపరేషన్ ఫ్రీగ అయింది. అదే లేకపోతే నేనిప్పుడు బతికి ఉండేటోణ్ని కాదు. నేను బతికుండి రెండు ముద్దలు తింటున్ననంటే అదంతా ఆయన పుణ్యమే!

- సందరగిరి భూమయ్య, అనంతపల్లి, సిరిసిల్ల






'ఎవరినైనా బలహీనవర్గాలు అని అంటున్నామంటే అది వాళ్ళ ఆర్థిక స్తోమతను బట్టే. మేధస్సులో వాళ్ళు ఎవరికీ తీసిపోరు'

## వైఎస్ వల్లే మా ఇంట్లో ముగ్గురు డాక్టర్లు!



**మా**దొక దిగువ మధ్యతరగతి కుటుంబం. నా భర్త సమీర్ ఉపాధ్యాయుడిగా పనిచేసేవారు. 2003లో ఆయనకు ఆరోగ్యం పాడైంది. ఒక్కసారిగా గుండెపోటు రావడంతో ఇక అప్పటినుంచి ఉద్యోగం మానేశారు. మాకు ముగ్గురూ ఆడపిల్లలే. ఒక్క మగబిడ్డ కూడా లేడు. ఆయన పరిస్థితి చూసి పిల్లలంతా భయపడ్డారు. వాళ్లందరికీ డాక్టర్ అవ్వాలన్నది కల. ఇంట్లో పరిస్థితులేమో వారిని డాక్టర్ చదువుల వరకూ తీసుకెళతాయా అన్నట్లు ఉండేది. మా అమ్మా, నాన్నల సాయంతో ఇంటర్ వరకూ బాగానే చదివించా. ఆ తర్వాత మెడిసిన్ సీటు సంపాదించగలరా అన్న భయం ఉండేది. అదే సమయంలో డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి గారు ప్రవేశపెట్టిన ముస్లిం మైనారిటీ రిజర్వేషన్ మా పిల్లలకు ఓ వరమైంది. ముగ్గురూ తమ తమ ప్రతిభతో, రిజర్వేషన్ కూడా తోడవ్వడంతో డాక్టర్ చదువులు చదివారు. పెద్దమ్మాయి జేబా అక్తర్, రెండో అమ్మాయి సమీర ఎంబీబీఎస్ పూర్తి చేసి పీజీ కోసం చదువుతున్నారు. మూడో అమ్మాయి ఆస్మా కౌసర్ ఇప్పుడు ఎంబీబీఎస్ చదువుతోంది. కర్నూలులోనే ఒక హాస్పిటల్ కట్టి సేవ చేయాలన్నది వారి కల. వైఎస్ వరంతోనే వాళ్ల చదువులు సాధ్యమయ్యాయి. ఇప్పుడు మా ఇంట్లో ముగ్గురు డాక్టర్లు ఉన్నారంటే అది ఆయన వరం ఫలమే!

**- షేక్ ఖుర్షిద్, కొత్తపేట, కర్నూలు**

## ఆరోగ్యశ్రీ వల్లే బతికాను





**సా**మాన్య కుటుంబం మాది. ఏదోలా సంసారం నెట్టుకొస్తుంటే 2008లో గుండెజబ్బు వచ్చింది. వైఎస్ రాజశేఖరరెడ్డి గారి దయవల్ల ఆరోగ్యశ్రీ కార్డు ఉండటంతో రాజమండ్రిలోని బొల్లినేని ఆస్పత్రిలో గుండె ఆపరేషన్ చేయించుకున్నాను. ఆపరేషన్ తర్వాత ఏడాదికి సరిపడా మందులు ఉచితంగా ఇచ్చారు. పూర్తిగా కోలుకుని, కుటుంబంతో సంతోషంగా జీవిస్తున్నా. ఇటీవల ఒంట్లో నలతగా ఉండి, కాళ్లకు వాపులు వచ్చాయి. తిరిగి గుండె ఆపరేషన్ చేయించుకున్న ఆస్పత్రికే వెళ్లి చూపించుకున్నాను. ఈసారి డాక్టర్లు సరిగా చూడలేదు.

**- పాలూరి నాగేశ్వరరావు, గూటాల, పోలవరం మండలం, పశ్చిమగోదావరి**



## వై.ఎస్. చలవ వల్లే మాటలొచ్చాయ్!



కొడుకు అక్షయ్‌తో మమత

**మా** అబ్బాయి అక్షయ్ పుట్టినప్పుడు ఎంతో సంబరపడ్డం. అయితే రెండేళ్లైనా మాటలు రాకుండ, సైగలు చేస్తూండేసరికి వాడికి వినపడదని, మాట్లాడడం రాదని అర్థమైంది. అప్పటికే కొన్ని ఆసుపత్రుల చుట్టూ తిరిగినా ఆపరేషన్‌కు లక్షలు ఖర్చు అయితదని వదిలేసినం. అయితే 2005ల అప్పటి ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డి గారు పిల్లల ఆపరేషన్ చేసేందుకు ముందుకొచ్చినరని తెలిసి ఆయన్ను కలిసినం. అక్షయ్‌ను చూసి 'ముచ్చటగా ఉన్నాడు పిల్లాడు. వీడికి ఆపరేషన్ చేయించే బాధ్యత నాది' అని వైఎస్ మాటిచ్చిన్రు. సీఎం రిలీఫ్ ఫండ్ నుంచి 6లక్షల దాకా ఇచ్చి బాబుకు నయం చేశిన్రు. ఇప్పుడు వాడు మంచిగ వినగలుగుతున్నడు. మాట్లాడుతున్నడు. చిన్నప్పట్నించి స్కూల్లో ప్రతీ క్లాస్‌లో ఫస్ట్ వస్తూ ఉన్నడు. అసలు మాటలే రావనుకుంటే మా బాబు ఇప్పుడు మంచిగ అన్నింట్ల ముందుంటున్నడంటే అది ఆ రాజన్న దయవల్లే! అక్షయ్ చెవికి పెట్టిన మెషీన్ నడపడానికి సంవత్సరానికి 30వేల దాకా ఖర్చయితుంది. దాన్ని గవర్నమెంట్ భరిస్తే బాగుంటది!

**- తూముల మమత, పెద్దపల్లి**




'నిరుపేదలకు పట్టెడన్నం దొరికేటట్లు చేయడం ప్రభుత్వ ధర్మం, అందుకు ఎన్ని కోట్లు ఖర్చయినా వెనుకాడకూడదు'



## ఆయన సాయం వల్లే నాలుగు మెతుకులు తింటున్నాం!

మాది నిరుపేద కుటుంబం. రెక్కాడితే గానీ డొక్కాడని బతుకులు. ఆటో తోలుకుంటూ పిల్లల్ని పోషిస్తూ ఆళ్లకు మంచి చదువులు చెప్పియ్యాలని కష్టపడుతున్న. ఇంతలో ఓరోజు గుండెజబ్బు వచ్చి మంచాన పడ్డ. ప్రైవేటు హాస్పిటల్‌ల చేరితే ఆపరేషన్‌కు 5 లక్షల దాక ఖర్చయితదని చెప్పిరు. ఆటో తోలుకొని బతికే నాకు అన్ని లక్షలు ఏడ నుంచొస్తయని బతుకు మీద ఆశలు ఒదిలేసుకున్నా. నా భార్య, పిల్లలు ఏమైతరని దిగులు పట్టుకుంది. అప్పుడే వైఎస్సార్ మొదలుపెట్టిన ఆరోగ్యశ్రీ కింద నా జబ్బుని ఫ్రీగ నయం చేస్తరని తెలిసింది. ఆరోగ్యశ్రీ కిందనే పైసా తీసుకోకుండా ఆపరేషన్ చేసి నాకు నయం చేశారు. ఇయ్యాల నేను బతికి నాలుగు మెతుకులు తింటున్నా, నా పిల్లలకు నేనున్నానన్న అది ఆ దేవుడి వల్లే! మేము తినే ప్రతి ముద్దకూ ఆ సారును తలుసుకుంటూనే ఉంటం.

**- బండి అంజిరెడ్డి, తిరుమలగిరి, నల్లగొండ**

## వైఎస్సార్ పుణ్యమే...



నిరుపేద కుటుంబంలో పుట్టాను. ఉండేందుకు చిన్న గూడు కూడా లేదు. ప్రభుత్వ పాఠశాలల్లో చదువుకుంటూ మంచి మార్కులు సాధించిన విద్యార్థులకు బాసర ట్రిపుల్ ఐటీలో అవకాశం కల్పించారు వైఎస్ రాజశేఖరరెడ్డి. ఆ అవకాశంతో నాకు పూలపాన్పు వేసినట్లయింది. నాకు సీటు దక్కింది. అక్కడే అయిదేళ్ల పాటు ట్రిపుల్ ఐటీ పూర్తి చేశాను. నాలుగేళ్ల క్రితం క్యాంపస్ సెలెక్షన్‌లో సెలక్టై హైదరాబాద్‌లోని ఇన్ఫోసిస్ సాఫ్ట్‌వేర్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాను.

**- దామెర్ల శివ, పెన్‌పహాడ్, సూర్యాపేట్**

## పేదోళ్ల పాలిట దేవుడు!



చిన్నపాటి కిరాణాకొట్టు పెట్టి బతుకుతున్నాను. చిన్న చిన్న జబ్బులు వస్తేనే తట్టుకోలేని జీవితాలు మావి. అలాంటిది పెద్ద జబ్బులు వస్తే? ఆ బాధను మాటల్లో చెప్పాలేము. నాకు ఇలాంటి పరిస్థితే వచ్చింది. 2010లో గుండెజబ్బుకు ఆపరేషన్ చేసుకోవాల్సి వచ్చింది. అయితే పేదోళ్ల పాలిట దేవుడిగా వచ్చిన రాజశేఖరరెడ్డి ప్రవేశపెట్టిన 'ఆరోగ్యశ్రీ' పథకం ద్వారా గుండెజబ్బు ఆపరేషన్ చేయించుకున్నాను. ఒక సంవత్సరం ఉచితంగా మందులు ఇచ్చారు. నాకు ఆపరేషన్ జరగకుంటే చచ్చిపోయేవాడిని. 'ఆరోగ్యశ్రీ' పథకం లేకుంటే మా కుటుంబం దిక్కులేనిదయ్యేది.

**- కటంగూరి సత్యనారాయణ, హుస్నాబాద్, సిద్దిపేట**

## ఏ లోకాన ఉన్నడో...



రాజన్న ఏ లోకాన ఉన్నాడో గానీ ఆయన పెట్టిన ఆరోగ్యశ్రీ కింద నాకు నిండు నూరేళ్ల ఆయుష్షు పోసిండు బాంచెన్. సుట్టాల ఊరికి బోతుండగా రోడ్డు ప్రమాదంల నా పక్కటెముకలు, చెయ్యి విరిగిపోయి కోమాలకు బోయిన. మా సుట్టాలు, వాళ్లూ వీళ్లూ నేను బత్కనని సొలిచ్చుకున్నరు. గటువంటి పరిస్థితులల్ల నాకు కూడా పానం మీద నమ్మకం లేకుండే. ఆరోగ్యశ్రీ కింద పట్నం దావఖానల శేరిఫ్ జేసింద్రు. రెక్కాడితేగానీ డొక్కలు నిండని పరిస్థితిలో ఉన్న నేను, పైస ఖర్చు లేకుండా రాజన్న దయ వల్ల ఇప్పుడు మంచిగైన. మా అసంటోళ్లకు ప్రాణం పోసిన రాజన్న కుటుంబం సల్లగుండాలే.

**- నిమ్మల లక్ష్మి, పోతారం, దుబ్బాక మండలం, సిద్దిపేట**





## నా చదువు ఆగిపోయేది



మాది చాలా నిరుపేద కుటుంబం. అమ్మ పద్మ, నాన్న విజయకుమార్ పచ్చళ్లు, అప్పడాలు తయారు చేసి అమ్ముతుంటారు. వచ్చిన ఆదాయం ఇల్లు గడవడానికే చాలేది కాదు. నానా కష్టాలు పడి అమ్మానాన్నలు నన్ను ఇంటర్ వరకు చదివించారు. పై చదువులు చదవాలనే ఆశ ఉన్నా, అమ్మానాన్నలకు నన్ను చదివించే పరిస్థితి లేదు. ఇక నా చదువు ఆగిపోతుందనే అనుకున్నాను. ఈలోగా వైఎస్ రాజశేఖరరెడ్డి గారు మాలాంటి పేద విద్యార్థుల కోసం ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకాన్ని ప్రవేశపెట్టారు. ఫీజు రీయింబర్స్‌మెంట్ సాయంతో నేను ఇంజనీరింగ్, ఎంబీఏ పూర్తి చేయగలిగాను. చదువు పూర్తయ్యాక హైదరాబాద్‌లోని ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీలో ఉద్యోగం పొందాను. ఇప్పుడు ఈ స్థితికి చేరానంటే అదంతా వైఎస్‌గారి చలవే! ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకమే లేకుంటే నా చదువు ఆగిపోయేది.

**- వీరమాచనేని కావ్య, దండేపల్లి, మంచిర్యాల**



## రోజూ ఆయన ఫొటోకు దండం పెట్టుకుంటా...

నేను 2009లో అనారోగ్యానికి గురయ్యాను. గుండె ఆపరేషన్ చేసి రెండు వాల్వులు అమర్చాలని డాక్టర్లు చెప్పారు. గుండె ఆపరేషన్‌కు రెండు లక్షలు ఖర్చు అవుతుందని చెప్పడంతో నాకున్న రెండెకరాల పొలం అమ్మాలని నిర్ణయించాం. ఆపద్బాంధవుడైన ఆనాటి ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డి ప్రవేశపెట్టిన ఆరోగ్యశ్రీ పథకం నాకు వర్తిస్తుందని డాక్టర్లు చెప్పారు. మరోవారం రోజుల్లో ఆపరేషన్ చేస్తారు అనగా స్వయంగా ముఖ్యమంత్రిగారే నా భుజం మీద చేయి వేసి ''నీ ఆరోగ్యానికి ఏమీ ఢోకా లేదు. ఎంత ఖర్చయినా ఆరోగ్యశ్రీ పథకం కింద వైద్యం చేయిస్తా'' అని భరోసా ఇచ్చారు. ఆ దేవుని దయ వల్ల ఈరోజు బతికి బట్ట కట్టాను. ప్రతిరోజు ఉదయం నిద్ర లేవగానే ఆయన ఫొటోకు దండం పెట్టుకుంటాను. ఆయన మా ఇంటి ఇలవేల్పు.

**-నారగాని మట్టయ్యగౌడ్, మునగాల, సూర్యాపేట**

## ఆరోగ్యశ్రీ ఆయుష్షు నిలిపింది



పాన్‌షాపు నడుపుకుంటూ పొట్ట పోసుకునేవాణ్ని. నలుగురు మనుషులున్న కుటుంబం నాది. వచ్చే ఆదాయంతో రోజు గడవడమే కష్టంగా ఉండే పరిస్థితుల్లో 2012లో గుండెపోటు వచ్చింది. చాలా ఆస్పత్రుల్లో చూపించుకున్నా. డాక్టర్లు రకరకాల పరీక్షలు చేశారు. వీలైనంత తొందరగా ఆపరేషన్ చేయించుకోవాలని, లేకపోతే ప్రాణం దక్కడం కష్టమని చెప్పారు. అప్పటికే అందినకాడికల్లా లక్షన్నర వరకు అప్పులు చేశాను. ఈలోగా ఆరోగ్యశ్రీ పథకం గురించి తెలుసుకుని హైదరాబాద్‌లోని నాంపల్లి కేర్ ఆస్పత్రిలో చేరాను. అక్కడే నాకు ఉచితంగా గుండె ఆపరేషన్ చేశారు. కోలుకునేంత వరకు ఉచితంగా చికిత్స చేశారు. మందులు ఉచితంగానే ఇచ్చారు. రాకపోకల చార్జీలు కూడా చెల్లించారు. మహానుభావుడు వైఎస్ రాజశేఖరరెడ్డి గారు ప్రవేశపెట్టిన ఆరోగ్యశ్రీ పథకమే నా ఆయుష్షు నిలిపింది.

**- జె.వెంకటేశ్వరరావు, ఇల్లెందు, భద్రాద్రి కొత్తగూడెం**

## నా గుండెలో బతికే ఉన్నాడు!



ఆటో నడుపుకుంటూ కుటుంబాన్ని సాదుకుంటున్నాను. గుండె సంబంధమైన సమస్యతో ఆస్పత్రిలో చేరితే... ఆపరేషన్ చేయాలన్నారు డాక్టర్లు. రెక్కాడితేగానీ డొక్కాడని పరిస్థితుల్లో ఉన్న నేను ఇది విని షాకయ్యాను. లక్షల రూపాయలతో కూడిన వ్యవహారం కావడంతో దిక్కుతోచలేదు. ఇలాంటి కష్టకాలంలో ఆరోగ్యశ్రీ వల్ల పైసా ఖర్చు లేకుండా ఆపరేషన్ చేయించుకోగలిగాను. ఇప్పుడు నా జీవితాన్ని మళ్లీ ప్రారంభించిన. నాకు భార్య, చిన్న వయసులో ఉన్న పాప, బాబు ఉన్నారు. ఆరోగ్యశ్రీ లేకుంటే నా కుటుంబ పరిస్థితి ఎలా ఉండేదో ఊహించుకుంటే భయంగా ఉంది. ఎంతో మందికి జీవితాన్ని ఇచ్చిన వైఎస్సార్ నా గుండెలో బతికే ఉన్నాడు.

**- ఎండీ.షాబుద్దీన్, మైలారం, బొమ్మలరామారం మండలం, యాదాద్రి భువనగిరి**



## ఆయనే మా ఇంటి దైవం

నిరుపేద కూలీని నేను. పెద్దాయన వైఎస్ రాజశేఖరరెడ్డిగారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్, ఆరోగ్యశ్రీ పథకాలు నా ఇద్దరు కొడుకులకు బతుకునిచ్చాయి. పెద్దబ్బాయి యోగానందబాబుకు గుండెలో రంధ్రం పడింది. ఆపరేషన్ చేయకపోతే ఎక్కువ రోజులు బతకడని డాక్టర్లు చెప్పారు. ఆరోగ్యశ్రీ పథకం కింద గుండె ఆపరేషన్లు కూడా చేస్తారని తెలుసుకుని మేదరమెట్లలో జరిగిన కార్యక్రమానికి నా కొడుకును తీసుకెళ్లాను. ఆ కార్యక్రమానికి వైఎస్‌తో పాటు పెద్దపెద్ద డాక్టర్లంతా వచ్చారు. ఆ డాక్టర్లు నా కొడుకును పరీక్షించి నెల్లూరులోని బొల్లినేని ఆస్పత్రికి పంపించారు. పైసా ఖర్చు లేకుండా ఆపరేషన్ చేసి బతికించారు. పెద్దబ్బాయి అనారోగ్యం వల్ల ఏడో తరగతితోనే చదువు ఆపేశాడు. ఇప్పుడు నాతో పాటే కూలి పనులకు వస్తూ మా కుటుంబానికి చేదోడుగా ఉంటున్నాడు. చిన్న కొడుకు వేణు సాయికుమార్‌ను బాగా చదివించాలనుకున్నాం. ఫీజు రీయింబర్స్‌మెంట్ పుణ్యమా అని అతణ్ని బీటెక్ చదివించాం. ఇప్పుడు అతడు బెంగళూరులో సాఫ్ట్‌వేర్ ఇంజనీరుగా పని చేస్తున్నాడు. నా ఇంటి దీపాల బతుకుల్లో వెలుగులు నింపిన మహానేత వై.ఎస్... ఆయనే మా ఇంటి దైవం.

- మద్దెల వెంకటేశ్వర్లు, నాగాంజలిదేవి దంపతులు, పెద్ద కొడుకు యోగానందబాబు, సింగరాయకొండ, ప్రకాశం

## మా పాలిట దేవుడు వైఎస్ తాతయ్య



నాలాగే గుండె జబ్బుతో బాధపడే ఎంతోమంది చిన్నారులకు ఆరోగ్యశ్రీ ద్వారా ఉచితంగా చికిత్స చేయించారు వైఎస్ తాతయ్య. మా తల్లిదండ్రులు తాతయ్యను ఎప్పుడూ తలుచుకుంటారు. నాకు ఆపరేషన్ చేయించేందుకు తగిన ఆర్థికస్థోమత లేక వారు పడిన బాధలు నాకు ఇప్పటికీ చెబుతుంటారు. ఆ సమయంలో తాతయ్య ప్రవేశపెట్టిన ఆరోగ్యశ్రీ నా ప్రాణాలను కాపాడింది.

- కంభం ఉదయ్‌కిరణ్, కోదాడ, సూర్యాపేట

## ఇలా ఉన్నామంటే ఆయన చలవే!





నాగకుమార్

మాది మధ్య తరగతి కుటుంబం. చిన్నపాటి చిల్లర దుకాణంతో వచ్చే ఆదాయంతోనే ఏడుగురు మనుషులు బతకాలి. అనుకోకుండా గుండెనొప్పి రావడంతో ఆస్పత్రికి వెళ్లాను. ఆపరేషన్ చేయించుకోవాలని డాక్టర్లు చెప్పారు. మూడున్నర లక్షలు ఖర్చవుతుందన్నారు. మహానుభావుడు వైఎస్ రాజశేఖరరెడ్డి గారి చలవతో అప్పటికే ఆరోగ్యశ్రీ కార్డు తీసుకుని ఉండటంతో కార్పొరేట్ ఆస్పత్రిలో గుండె ఆపరేషన్ చేయించుకోగలిగా. ఆపరేషన్ తర్వాత ఇంటికి తిరిగి వెళ్లడానికి అయ్యే చార్జీలను కూడా ఆస్పత్రి వారే చెల్లించారు. ఏడాది పాటు ఉచితంగా మందులు కూడా ఇచ్చారు. ఇదొక్కటే కాదు, వైఎస్ గారు ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం వల్ల మా అబ్బాయి నాగకుమార్ బీటెక్ పూర్తిచేసి, దుగ్గిరాలలోని సీసీఎల్ కంపెనీలో ఉద్యోగం తెచ్చుకున్నాడు. మా నలుగురు అమ్మాయిల పెళ్లిళ్లకు అతడి ఉద్యోగమే ఆధారమైంది. వైఎస్ గారి పథకాలే లేకుంటే మా కుటుంబం అప్పుల పాలై, నిలువనీడ లేని స్థితిలో ఉండేది. ఇప్పుడు ఎలాంటి ఇబ్బందులూ లేకుండా హాయిగా ఉన్నామంటే అదంతా ఆయన చలవే! మా ఇంట దీపం వెలిగించిన దేవుడాయన.

- పెనుమల్లి శివసత్యనారాయణ, మంగళగిరి, గుంటూరు

## 108 లేకపోతే ప్రాణం పోయేదే!



నేను నలభై ఏళ్ల క్రితం కేరళ నుంచి ఇక్కడికొచ్చి హోటల్ నిర్వహిస్తూ జీవిస్తున్నా. ఓ రోజు బైక్ యాక్సిడెంట్‌లో నా తలకు, కాలికి పెద్ద గాయాలయ్యాయి. ఆ సమయంలో నేను పూర్తిగా అపస్మారక స్థితిలోకి వెళ్లిపోగా, అక్కడి స్థానికులు 108 అంబులెన్స్‌లో నన్ను విజయవాడకు తరలించారట. టైమ్‌కి హాస్పిటల్‌కి తీసుకెళ్లడం, 108లోనే ప్రాథమిక చికిత్సనందించడం వల్ల ప్రాణాలతో బయటపడగలిగానని డాక్టర్లు చెప్పారు. వైఎస్సార్ ఆలోచన నుంచి పుట్టిన 108 గొప్పదనం గురించి ఎంత చెప్పినా తక్కువే! ఆయన రుణం ఎప్పటికీ తీర్చుకోలేనిది.

- పరంబత్ ఇబ్రహీం, కంకిపాడు, కృష్ణా




''గౌరవనీయ సభ్యులకు!

ఫితూరీ నాయకుడు శ్రీరామరాజు గూఢచారి వ్యవస్థను ఏర్పాటు చేసుకోవడంలో నిపుణుడు. మైదాన ప్రాంతంతో సంబంధం కలిగి ఉన్నాడు. చింతపల్లి, మరో రెండు పోలీసు స్టేషన్ల మీద దాడులతో విశాఖ మన్యం తిరుగుబాటు ఆరంభమైంది. పోలీసులు ప్రతిఘటించలేకపోయారు. మద్రాసు జిల్లా పోలీసు యంత్రాంగంతో చర్చించి, మలబారు దళాలను పంపించాం. అవసరమైతే సైనిక వ్యవస్థ సేవలు తీసుకోవడానికి కూడా సంప్రదించాం.

మోత పని కోసం గుర్రాలు పంపించాం. వైర్లెస్ సెట్లు కూడా వెళ్లాయి.

పదిహేను మంది వరకు బ్రిటిష్ అధికారులు పరిస్థితిని అదుపులోకి తెచ్చే కార్యక్రమంలో భాగం పంచుకుంటున్నారు. మద్రాస్ రెడ్‌క్రాస్ అంబులెన్స్‌ను ఏర్పాటు చేసింది. హిజ్ ఎక్స్‌లెన్సీ గవర్నర్ అదనపు వ్యయం కోసం ఇరవై వేల రూపాయలు మంజూరు చేశారు.'' అంటూ చాలా విషయాలు చెప్పాడు. చివరికి శ్రీరామరాజు ఉద్యమం గురించి ప్రభుత్వం ఎప్పటికప్పుడు సభ్యులకి సమాచారం ఇవ్వాలని అంతా కోరారు. సాధ్యమైనంత త్వరగా అణచివేయాలని కూడా ఎక్కువ మంది అభిప్రాయపడ్డారు.

**2**

అలా వచ్చి వయ్యారంగా వాలిందా పావురం, చిత్రాంగి భుజం మీద.

''ఎవరిదీ కపోతము?'' ముచ్చటపడుతూ చెలికత్తెను ప్రశ్నించింది చిత్రాంగి.

''ఇది... ఇది... యువరాజు సారంగధరుల వారి పావురము వలెనున్నది మహారాణి!'' చెప్పింది చెలికత్తె.

ఆ మాటతో చిత్రాంగి ఉబ్బితబ్బిబ్బయింది. ముందున్న హార్మోనిస్టుకు సైగ చేసి, పాట అందుకుంది. దానికి తగ్గట్టు నృత్యం కూడా చేస్తోంది.

''పాపం! ఆ రోజుల్లో సమాచారం పంపాలంటే పావురాలే ఆధారం కాబోలు?!'' అన్నాడు ఆ కానిస్టేబుల్ అక్కడే ఉన్న గొలుగొండ రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ కందుకూరి నారాయణరావుతో.

నర్సీపట్నం-కృష్ణదేవిపేట మార్గంలో ఉంది జోగంపేట. రామరాజు దళం ఆ చుట్టుపక్కలే అనంతసాగరం, వెలగపాలెం, కొత్తమల్లంపేట వంటి చోట్ల తిరుగుతోందని తెలిసి పట్టుకోవడానికి బయలుదేరిన ప్రత్యేక పోలీసు బృందం కాళ్ల పీకి, నాటక ప్రదర్శన జరుగుతూ ఉంటే చతికిలపడింది. ఆ బృందానికి నారాయణరావు నాయకత్వం వహిస్తున్నాడు.

సారంగధర నాటకం. రామాలయం దగ్గరే వేదిక. చిత్రాంగి వేషం పురుషుడే కట్టినా లొట్టలు వేస్తూ చూస్తున్నారు పోలీసులు.

''తెల్లదొరలు రావడం కొంచెం ఆలస్యమైంది గానీ, లేకపోతే చిత్రాంగి కూడా సారంగధరుడితో ఫోన్‌లో మాట్లాడుకునేది.'' అన్నాడు తనో కొత్త విషయం కనుక్కున్నట్టు ఆ కానిస్టేబుల్.

''సారంగధరుడంటే పదకొండో శతాబ్దం వాడు. అప్పటికి వాళ్లకి కూడా ఫోన్లు లేవు'' అన్నాడు నారాయణరావు, ఆ కానిస్టేబుల్ అజ్ఞానాన్ని ఎద్దేవా చేస్తున్నట్టు.

''అలాగా! దొరగారూ! ఇంతకీ కృష్ణదేవిపేట-నర్సీపట్నం మధ్యన ఫోన్లు ఎప్పుడు మాట్లాడతాయి?'' అడిగాడు, కానిస్టేబుల్.

''ఎంతోకాలం పట్టదు. వైర్లు కూడా బిగించారు.'' అన్నాడు నారాయణరావు.

''ఇంక కృష్ణదేవిపేటకి కబురు తీసుకెళ్లాలంటే గుర్రాల మీద, సైకిళ్ల మీద, ఎడ్లబండి మీద పోనక్కరలేదయితే!'' అడిగాడు కానిస్టేబులు.

సాంకేతిక పరిజ్ఞానం మీద వీడికి ఇప్పుడే ఉత్సుకత రేగాలా, నా ఖర్మ కాకపోతే అనుకుంటున్నాడు నారాయణరావు. కానీ టెలిఫోన్ తీగల వ్యవహారం అందరికీ ఆసక్తిగానే ఉంది. రామరాజు ఉద్యమం కాదుగానీ, చాలా కొత్త కొత్త విషయాలు మన్యం దాకా వస్తున్నాయి.

పందిట్లో ఒక మూలగా వేసి ఉంది కర్ర కుర్చీ. అందులో కూర్చుని ఉన్నాడు నారాయణ రావు. అతడి పక్కనే నిలబడి నాటకం చూడనివ్వకుండా విసిగిస్తున్నాడు కానిస్టేబుల్.

''రాత్రుళ్లు కూడా మాట్లాడుకోవచ్చా?'' అడిగాడు కానిస్టేబుల్.

''రాత్రయితే ఏం?'' విసుగ్గా అడిగాడు నారాయణరావు.

''తీగలు కనిపించవు కదా!'' అన్నాడు కానిస్టేబుల్.

'మాకు బాగానే కనిపించాయి!' లోపలే అనుకున్నాడు, గొంగళి కప్పుకుని ఈ ఇద్దరికి కాస్త సమీపంలో కూర్చుని నాటకం చూస్తున్న ఒక వ్యక్తి.

పగటివేళ మన్యమంటే మనోహర ప్రకృతి దృశ్యాల సజీవ చయనిక. కానీ ముసిరిన చీకట్లలో అదో బీభత్స హేల. కాటుక దిబ్బల్లా కనిపించే కొండల మీద తారకల మసక చీకట్ల ఆకాశం-దిగంతాలు కలసిపోయినట్టుంటుంది సుదూరంలో. ఆ చీకటిలోనే ఇంతసేపూ తిరిగి, ఇప్పుడే అక్కడికి వచ్చారు కొండదళం సభ్యులు. కృష్ణదేవిపేటలో మొదలు పెట్టారు, టెలిఫోన్ తీగలను గమనించడం. కొద్దిసేపటి క్రితమే జోగంపేట గ్రామ శివార్ల దాకా చూశారు వాటిని. ఊర్లోకి వచ్చి పోలీసులతో పాటే నాటకం చూస్తున్నారు హాయిగా.

ఆ గొంగళి కప్పుకున్న వ్యక్తి గోకిరి ఎర్రేసు.

అతడికి కొంచెం దూరంగా అలాగే గొంగళి కప్పుకుని కునికి పాట్లు పడుతూనే నాటకం చూస్తున్న మనిషి మల్లు. తల మీద నుంచి నల్లటి గొంగడి కప్పుకుని, ఒక ఇంటి అరుగు మీద నిలబడి కళ్లప్పగించి నాటకం చూస్తున్న మనిషి శ్రీరామరాజు.

ఆ అంకం పూర్తయింది.

వేదికకి అటూ ఇటూ వేలాడదీసిన పెట్రోమాక్స్ లైట్ల మీదకి వెదురు బుట్టలను దింపుతున్నారు నిర్వాహకులు.

వేదిక మీద చీకటి ఆవహిస్తోంది. నెమ్మదిగా దిగడం ఆరంభమైంది తెర.

అప్పుడే ఎవరో గట్టిగా అరిచారు–

''వందేమాతరం!''

ప్రేక్షకులంతా లేచిపోయి ఒక్కసారిగా అరిచారు–''మనదే రాజ్యం!''

ఆ వెంటనే మరో నినాదం –''అల్లూరి శ్రీరామరాజుకీ!''

''జై!''

ఏమీ అర్థం కావడం లేదు పోలీసులకి. భయంతో అంతా అక్కడ నుంచి పారిపోయారు.

ఏకాకిగా మిగిలిన కందుకూరి నారాయణరావు దగ్గరకి వచ్చి నమస్కరించాడు రామరాజు.

ఇప్పుడు రామరాజు, ఆయన సహచరులందరి ఒంటి మీద ఖాకీ దుస్తులు లేవు. అంతా కోరా ఖద్దరు దుస్తులు ధరించి ఉన్నారు.

పోలీసులు, ఉద్యమకారులు ఖాకీ దుస్తులే ధరించడం చాలామందికి మనస్కరించడం లేదు.

రామరాజు ఒంటి మీద కోరా చొక్కా, ఖద్దరు నిక్కరు ఉన్నాయి.

''నమస్కారం రాజుగారు! చాలా రోజులైంది కలిసి. మీరు ఇక్కడికి వస్తారని ఊహించలేదు. అంతా నాటకీయంగా ఉంది. సమయానికి కలుసుకున్నాం. ఒక ముఖ్య విషయం మీతో చెప్పాలని ఉంది. ఇటు వస్తారా?'' అన్నాడు నారాయణరావు.

ఇద్దరూ ఒక చెట్టు కిందకు వచ్చారు. వేదిక మీద తెర దించుతున్నారు నిర్వాహకులు.

''పాపం మా మూలంగా తెర చాలాసేపు దించవలసి వచ్చింది!'' అన్నాడు రామరాజు.

''ఒకమాట చెబుతాను రాజుగారు! దొరతనానికీ మీకూ మధ్య జరుగుతున్న దోబూచులాటలకి కూడా తెర దిగడం ఖాయంగా కనిపిస్తోంది. ఇకపై మీరు చాలా జాగ్రత్తగా ఉండాలి. ప్రభుత్వం పిడికిలి బిగించడం ఇక తప్పదు. అప్పుడు మాత్రం దెబ్బ తిన్న పులిలా పడతారు.'' అన్నాడు నారాయణరావు.

''మలబారు దళాల అండతోనా?'' రామరాజు అన్నాడు.

''మలబారు దండు ఎలాగూ తోడవుతుంది. దక్షిణ కమాండ్ నుంచి లూయీ ఫిరంగులు వచ్చి చేరాయి. వాటిని చూసుకునే, అణచివేతలో కొత్త అంకాన్ని ఆరంభించాలని నిర్ధారించుకుంది పోలీసు యంత్రాంగం. దానికి మించి, ఇప్పుడు మీరంటే కొత్త భయాలు మొదలైనాయి. రాజమండ్రి జైలు నుంచి నాగపూర్ తీసుకువెళుతుంటే గదర్ విప్లవకారుడు పృథ్వీసింగ్ ఆజాద్ రైలులో నుంచి దూకి తప్పించుకున్నాడు. అది పుండు మీద కారం రాసినట్టే ఉంది దొరతనానికి. ''

''ఎప్పుడు తప్పించుకున్నారాయన?'' అడిగాడు రామరాజు, ఆశ్చర్యపోతూ.

''నిన్ననే. 29వ తేదీ. వేగంగా పోతున్న రైల్లో నుంచే దూకేశాడటాయన. ఇవాళ మధ్యాహ్నమే మాకు తెలిసింది. అది కాదు అసలు వింత. మిమ్మల్ని వెతుక్కుంటూ పృథ్వీసింగ్ నేరుగా విశాఖ మన్యానికే వస్తాడని గట్టి అనుమానం వీళ్లందరికీ! కొత్త అంకం బీభత్సరసంతోనే ఉండొచ్చు.'' చెప్పాడు నారాయణరావు, కొంచెం ఇబ్బందిగా నవ్వుతూ.



తెల్లవారాక అధికారులకి అసలు విషయం తెలిసింది.

రాత్రి కొండదళం కృష్ణదేవిపేట నుంచి జోగంపేట శివార్ల వరకు ముప్పయ్ చోట్ల టెలిఫోన్ తీగలను కత్తిరించింది. ఆ ఊళ్లోనే భోజనాలు చేసింది. కొద్దిసేపు నాటకం కూడా చూసింది. రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ కందుకూరి నారాయణరావు అంత మంది చూస్తుండగా రామరాజుతో మాటామంతీ జరిపాడు.

అందుకే వెంటనే ఆయన్ను సస్పెండ్ చేసేసి, కేసు నమోదు చేయించాడు హెపెల్ .

## 3

అక్టోబర్ 12, 1922 నాటికి మలబారు దళాల రాక పూర్తయింది.

పూనాలోని దక్షిణ కమాండ్ కార్యాలయం నుంచి రెండు లూయీస్ గన్‌లు కూడా వచ్చేశాయి.

ప్రపంచ యుద్ధంలో ఉపయోగించిన బలమైన ఆయుధం – లూయీస్ గన్. అమెరికా వారు తయారు చేస్తే మొదటిసారి ఇంగ్లండ్ మహా యుద్ధంలో ప్రయోగించింది. లూయీస్ ఆటోమేటిక్ గన్ లేదా లూయీస్ ఆటోమేటిక్ రైఫిల్ అంటారు.

అక్టోబర్‌లో వచ్చిన పెను తుపానుతో అనారోగ్యం పాలైన పోలీసులు కూడా కోలుకున్నారు.

రామరాజు జబ్బు పడి ఉన్నాడని మన్యంలో చెప్పుకుంటున్న తరుణం. అసలు కొండదళంలోనే చీలిక వచ్చిందని కూడా వినిపిస్తోంది. ఇలాంటి అదును కోసమే చూస్తోంది పోలీసు యంత్రాంగం.

బ్రిటిష్ సామ్రాజ్యం తలుచుకుంటే ఎంతటి గాయం చేయగలదో చూపించాలని తహతహ లాడిపోతున్నది.

ఆ రోజు డిసెంబర్ 6, 1922.

శరభన్నపాలెంలో వెతికారు. అక్కడ నుంచి కొండ దరిన ఉన్న నిమ్మగడ్డలో గాలించారు. అక్కడికి మైలు దూరంలోనే ఉంది పెద్దగడ్డపాలెం.

ఈ కదలికలన్నీ గమనిస్తున్నారు ఇద్దరు కొండదళం సభ్యులు.

జాన్, చార్ల్స్ నాయకత్వంలో పెద్ద బలగమే గాలిస్తోంది.

59 మంది మలబారు దళం సభ్యులు. అంటే రెండు పటాలాలు. కూడా మరో 20 మంది అధికారులు – దాదాపు 15 కంచర గాడిదలు, ఆహార పదార్థాలతో.

ఏదో కీడు శంకిస్తూ, గడగడలాడిపోతోంది మన్యం.

ఆ ఇద్దరు నిన్నటి నుంచి తమని అనుసరిస్తున్న సంగతి మొదట జాన్ కనిపెట్టేశాడు.

ఈ ఉదయం ఆ ఇద్దరు దొరికిపోయేలా చిన్న పథకం వేశాడు.

బలపరుపుగా ఉన్న ఒక రాయి మీద కూర్చోమన్నాడు చార్ల్స్‌ని, జాన్. వెనక జేబులో నుంచి ఒక కాగితం తీసి రాయి మీద పరిచాడు. పై జేబులో నుంచి ఒక పెన్సిల్ ముక్క తీసి ఊరికే పెదవులు కదుపుతూ గీయడం మొదలుపెట్టాడు.

ఆ ఇద్దరు చూస్తూనే ఉన్నారు, దూరం నుంచి.

ఏదో నిర్ధారించినట్టు చివాల్న లేచాడు జాన్. అతడి వెనకే లేచాడు చార్ల్స్. అక్కడ నుంచి వడివడిగా అడుగులు వేసుకుంటూ ముందుకు వెళ్లిపోయారు.

ఆ కాగితం అక్కడ వదిలేశారు.

పావుగంట ఆగి, నెమ్మదిగా ఆ ఇద్దరు ఆ రాయి దగ్గరకే వచ్చి ఆ కాగితం తీసుకుపోయారు.

రెండు బలమైన చేతులు ఇద్దరి మెడలని ఒక్కసారే పట్టేశాయి, పాము కప్పని పట్టినట్టు.

ఒక జమేదారు, ఒక కానిస్టేబుల్. వాళ్లతో ఇంకో నలుగురు, లాఠీలతో. ముందే మాటేసి వచ్చి పట్టుకున్నారు.

అక్కడే ఉంది ఒక చిన్న పశువుల కొట్టం. కన్నుమూసి తెరిచే లోగా అందులోకి చేర్చారు ఇద్దరినీ.

ఇద్దరూ యువకులే. భయంతో వణికిపోతున్నారు.

''ఎవర్రా మీరు?'' చింతపల్లి పోలీసు పిడికిలి బిగిస్తూనే అడిగాడు.

''కొండోళ్లం దొరా!'' అన్నాడొకడు.

ఎప్పుడు పిడికిలి వాడి కడుపును తాకిందో, ఎప్పుడు కింద పడిపోయాడో తెలియదు.

ఆ సమాధానం ఇచ్చిన వాడు కింద పడి గిలగిలలాడుతున్నాడు.

''నువ్వు చెప్తావా? ఎవరు మీ ఇద్దరు?'' మళ్లీ బిగుసుకుంటోంది పిడికిలి.

''నాకేం తెల్దు దొరా! నాకేం తెల్దు!''

ఈసారి ముఖం పగిలిపోయేటట్టు కొట్టాడు చింతపల్లి పోలీసు, రెండోవాడిని.

పెదవి పగిలి చివ్వున చిమ్మింది రక్తం.

''చెప్పండి!'' ఆ ఆరుగురు కలసి నరకం చూపిస్తున్నారు. అయినా నోరు విప్పడం లేదు.

ఆ మొండి పట్టుదలతోనే పోలీసులకి రూఢీ అయింది.

''మీరు కొండదళంలో వాళ్లే. చెప్పండి! రామరాజు ఎక్కడున్నాడు?'' పళ్లు నూరుతూ అడిగాడు చింతపల్లి పోలీసు.

మళ్లీ ఎముకలు విరిగేటట్టు గుద్దారు.

''మీరు ఇవాళ ఏదో ఒకటి చెబితేనే బతుకుతారు. లేకపోతే ఇక్కడే చస్తారు.''

గంట తరువాత మాంసం ముద్దలైపోయారు ఆ కొండవాళ్లు ఇద్దరూ. మొత్తానికి చెప్పించాడు చింతపల్లి పోలీసు.

వెంట తెచ్చిన ఒక లూయిస్ గన్‌తో పెద్దగడ్డపాలెం వైపు ఉరికింది మలబార్ బలగం.

ఒకచోట విశాలమైన వరిపొలాలు కనిపించాయి. మధ్య మధ్య చింతచెట్ల గుబుర్లు. తుపాకులు బారు పెట్టి అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తున్నారు డబ్బయ్ మంది.

అన్ని వైపులా దృష్టి సారించుకుంటూ సాగుతున్నారు.

బాగా పెరిగిన వరిపొలం గట్టున నడుస్తుంటే, చాటు నుంచి హఠాత్తుగా కాల్పులు మొదలయ్యాయి.

ఆ వరిపొలంలో తుపాకులుపేలిన వైపు పరుగులు తీశారంతా.

అక్కడ ఎంత హఠాత్తుగా కాల్పులు మొదలైనాయో, అంత హఠాత్తుగానూ ఆగిపోయాయి కాల్పులు.

వరిచేలకి ఒకవైపు ఉన్న కొండ మీద రహస్య స్థలాల నుంచి బయటపడి అక్కడ నుంచి కాల్పులు మొదలుపెట్టింది కొండదళం.

కానీ ఒక పక్క నుంచి జాన్ బృందం, మరో పక్క నుంచి చార్లీ దండు ఒక్కసారే కాల్పులు మొదలుపెట్టి కొండదళం అయోమయంలో పడిపోయేటట్టు చేశారు.

ఆ అయోమయం నుంచి బయటపడి పోలీసు బలగాన్ని ఎదుర్కోనాలని మూడుసార్లు చేసిన ప్రయత్నం కూడా విఫలమైపోయింది.

కొండ మీద ఉన్న ప్రధాన దళం మినహా, మిగిలిన వారంతా వరిచేలలో పాక్కుంటూ అక్కడ నుంచి పారిపోయే ప్రయత్నం ప్రారంభించారు. వరిచేల మీదుగా పారిపోవడం అంటే, పోలీసు బలగాల ఎదుటి నుంచి వెళ్లడమే. ఒక ఉద్యమకారుడు అక్కడికక్కడే కూలిపోయాడు.

కొండదళాన్ని తరుముకుంటూ జాన్ బృందం వెళ్లింది.

వరిచేలకి అవతలే కొద్దిదూరంలో మళ్లీ జొన్నచేలు కనిపించాయి. మనిషి ఎత్తున ఉంది పైరు. అక్కడికి వెళ్లాక గాని రామరాజు సేనకు ఊపిరి తీసుకుని తిరిగి కాల్పులు జరపడానికి వీలుకాలేదు.

అప్పుడే లూయిస్ గన్ ప్రయోగించడం మొదలుపెట్టాడు జాన్.

కొండదళం తట్టుకోలేక నిష్క్రమించక తప్పలేదు. గుళ్లని వర్షిస్తోంది అది.

మరో ఇద్దరు కొండదళం సభ్యులు పడిపోయారు. వాళ్లలో హాహాకారాలు.

ఇవతల పక్క జమేదార్ కేశవనాయర్ కడుపు మీద తూటా తగిలి బలమైన గాయమైంది.

ఆ చుట్టుపక్కల ఉన్న ప్రజలు ఏడుపులు పెడబొబ్బలతో చేతి కందిన సామాను తీసుకుని ఇళ్ల నుంచి కట్టుబట్టలతో ఎవరికి తోచిన దిక్కుకు వారు పరుగెడుతున్నారు. వరసగా గ్రామాలన్నింటికీ చేరుతోంది సమాచారం. తల్లడిల్లిపోతున్నారు కొండప్రజలు.

కొండ కనుమలలో గాలిస్తున్న స్వెయిన్ బలగాలకి కూడా పెద్దగడ్డపాలెం కాల్పుల గురించి తెలిసింది.

47 మంది నాన్ కమిషన్డ్ అధికారులు, ఇంకో పటాలం మలబారు దళం, కీనే, సుబేదార్ ఫణిక్కర్, పరమేశ్వరన్ నాయర్ అనే మరో మలబార్ దళం అధికారి హుటాహుటిన ట్రక్కులలో అక్కడకి చేరిపోయారు. అంతా కలసి కొండదళాన్ని తరుముకుంటూ వెళ్లారు.

కొంతదూరం వచ్చేసరికి మళ్లీ ఎవరూ కనిపించలేదు. సాయంత్రం అవుతోంది. అయినా వెనుదిరగకుండా గాలిస్తూనే ఉన్నారు.

''ఇక్కడే ఉంటారు. ఇవాళ వదిలే ప్రశ్నే లేదు.'' జాన్ శపథం చేస్తున్నట్టే అన్నాడు.

అప్పుడే అటుగా వచ్చారు ఒక గిరిజన కుటుంబం. ఈ కాల్పులకు భయపడే సామాను పట్టుకుని ఎటో పోతున్నారు.

వాళ్లని కొట్టినంత పనిచేస్తే కొందరు విల్లమ్ములతో లింగాపురం వైపు వెళుతూ కనిపించారని చెప్పారు.

పెద్దగడ్డపాలానికి అయిదు మైళ్ల దూరంలోనే ఉంది లింగాపురం. అక్కడే పెద్ద వాగు కనిపించింది. జాన్, చార్లీ అలసటతో దాని గట్టున కూలబడ్డారు.

బలగాలు చుట్టూ వెతుకుతూనే ఉన్నాయి. చీకట్లు పడిపోతున్నాయి. బ్యాటరీ లైట్లు కూడా సిద్ధం చేసుకుంటున్నారు.

అప్పుడే ఎలా వచ్చిందో ఆ ఆలోచన, స్వెయిన్‌కి. ఆ వాగులోనే దిగి, వాయువ్యంగా అలాగే శబ్దం కాకుండా నెమ్మదిగా నీళ్లలో నడిచాడు. ఆ వెనకే సుబేదార్ ఫణిక్కర్. ఇద్దరూ గన్‌లు గురిపెట్టి నడుస్తున్నారు.

తన కళ్లని తనే నమ్మలేకపోయాడు స్వెయిన్.

అక్కడే ఉంది కొండదళం స్థావరం.

ఒక్క క్షణం పరికించాడు.

ఒక పక్క ఎవరో కొందరు వంటలు చేస్తున్నారు.

కొందరు తూటాలు తగిలిన వాళ్లకి ఏవో ఆకులు వేసి కట్లు కడుతున్నారు. రెండు నెగళ్లు వేసి ఉన్నాయి అప్పటికే. వాటి వెలుగులో అంతా స్పష్టంగా కనిపిస్తోంది.

అప్పుడే రెండు కడవలు తీసుకుని అటు వచ్చారు ఇద్దరు.

ఆ ఇద్దరిని వెనుక నుంచి పీకలు పట్టుకుని చాలాదూరం వెనక్కి లాక్కుపోయారు ఇద్దరు పోలీసులు. అంతలోనే ఒకడు తప్పించుకున్నాడు. ఒక్క ఉదుటన దూకాడు. కానీ గురి తప్పింది. ఫణిక్కర్ తుపాకీ అడ్డం పెట్టాడు. దాని బాయ్‌నెట్ మీద పడిపోయాడు. కడుపు చీరుకుపోయింది. కొద్దిసేపటికే చనిపోయాడు.

అతడు శరభన్న పడాలు.

వెనక్కి వచ్చిన స్వెయిన్ సంగతి చెప్పి, మలబారు దళాలను మూడు భాగాలు చేశాడు.

ఒక విభాగం నీటిలో నుంచే వెళ్లింది. రెండో విభాగం వెనుక పక్కకు వెళ్లి మాటు వేసింది. మరొకటి ముందుకు వెళ్లింది.

పగలంతా యుద్ధం. తిండి లేదు. అంతా డస్సిపోయి ఉన్నారు కొండదళంలో.

అప్పుడు రెండు విభాగాలు ఒక్కసారిగా విరుచుకుపడి కాల్పులు ప్రారంభించాయి.

అయినా కొందరు వీరోచితంగా ఎదురొడ్డి పోరాడారు. కాల్పులు జరిపారు. కానీ ఎదుర్కోనడం సాధ్యం కాలేదు. అక్కడే ఉన్న కొండగుహలోకి పారిపోయారంతా.

నిజానికి అసలు స్థావరం అదే.

రామరాజు కోసం, ఇతర నాయకుల కోసం అక్కడ పక్కలు కూడా వేసి ఉన్నాయి. రామరాజు అక్కడే ఉండి, గాయపడిన వాళ్లకి ఏవో లేపనాలు పూస్తున్నాడు కాగడాల వెలుగులో.

ఆ పక్కల మీద ఎవరో ఉన్నారని కాల్పులు సాగించారు. నిజానికి రామరాజు పడుకునే పరుపు మీద కూడా కాల్పులు జరిగాయి.

*(తరువాయి భాగం వచ్చేవారం)*

## • సాల్వ్ చేస్తారా? శీర్షాసనమేస్తారా?

### • మాయా బజార్

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | | | 2 | | 3 |
| | | | | | | |
| 4 | | | | | | |
| | | | | 5 | | |
| 6 | 7 | | | | | 8 |
| | | | | | | |
| 9 | | | 10 | | | |

**అడ్డం:**

1. ముళ్లపూడి వెంకటరమణ నిర్మాణంలో, బాపు దర్శకత్వంలో రాజేంద్రప్రసాద్, దివ్యవాణి జంటగా నటించిన సినిమా (5)
4. దర్శకుడు తేజ నిర్మాణంలో, దశరథ్ దర్శకత్వంలో నితిన్, నికిత జంటగా నటించిన సినిమా. ఆర్పీ పట్నాయక్ సంగీతం (3)
5. నితిన్ 'ఆనంద్ విహారి', సమంత 'అనసూయ రామలింగం' పాత్రలలో నటించిన త్రివిక్రమ్ సినిమా. అటు నుంచి (2)
6. పీఎన్ రామచంద్రారావు దర్శకత్వంలో గిరిబాబు నిర్మాణంలో సుమన్, భానుచందర్, సుమలత నటించిన సినిమా. ఇళయరాజా సంగీతం. సినిమా పేరు అటు నుంచి (5)
9. జీవా, నయనతారలు జంటగా నటించిన చిత్రం (1)
10. ఈవీవీ సత్యనారాయణ దర్శకత్వంలో కృష్ణ, నాగార్జున, నగ్మా... నటించిన ఈ చిత్రానికి యం.యం. కీరవాణి సంగీతం (4)

**నిలువు:**

1. 'హృదయమనే కోవెల తలుపులు', 'మా పెరటి జామ చెట్టు', 'సౌందర్యలహరి'... పాటలు ఉన్న శ్రీకాంత్ సినిమా (5)
2. 'ఫస్ట్ ఫ్రేమ్ ఎంటర్‌టైన్‌మెంట్' బ్యానర్‌లో క్రిష్ దర్శకత్వంలో వరుణ్ తేజ్ 'దూపాటి హరిబాబు'గా నటించిన సినిమా. ప్రగ్యా జైస్వాల్ కథానాయిక (2)
3. శ్రీను వైట్ల దర్శకత్వంలో మహేశ్‌బాబు. సమంత, ప్రకాశ్‌రాజ్, సోను సూద్... నటించిన సినిమా. యస్. థమన్ సంగీతం సమకూర్చారు (3)
5. ఊహ, ఈవీవీ సత్యనారాయణ దర్శకత్వంలో ప్రధానపాత్రలో నటించిన చిత్రం (2)
7. బి. నరసింగ్‌రావు దర్శకత్వంలో అర్చన 'కమలాక్షి', భూపాల్‌రెడ్డి దొరగా నటించిన ఈ చిత్రం అయిదు జాతీయ అవార్డులను గెలుచుకుంది (2)
8. పి.ఎ. అరుణ్ ప్రసాద్ దర్శకత్వంలో పవన్ కళ్యాణ్, ప్రీతి జింగానియ నటించిన సినిమా. మాటలు... చింతపల్లి రమణ, సంగీతం రమణ గోగుల (3)

### • మైథోగ్రఫీ

1. ప్రబంధ సాహిత్యంలో కనిపించే కాల్పనిక పక్షి.



2. పై జవాబులో '4'వ అక్షరంతో శ్రీకృష్ణుడి పేరు.



3. దశరథ కుమారుడు పై జవాబులో '3'వ అక్షరంతో.



4. కుబేరుని మీదకు యుద్ధానికి వెళ్లిన మహాయోధుడు. పై జవాబులో '2'వ అక్షరంతో.



5. కుజంభుడు అనే రాక్షసుడు పాతాళంలో దాచిన స్త్రీ. పై జవాబులో మొదటి అక్షరంతో.



### • బ్రెయిన్ జిమ్

1. శంకులో పెంకు. పెంకులో తీర్థం.
2. కాళ్లు లేకుండానే నడుస్తుంది. దూకుతుంది. పరుగెడుతుంది.
3. వాలు కాని వాలు.
4. Thursday కంటే ముందు Friday ఎక్కడ వస్తుంది?

| | | | | |
|---|---|---|---|---|
| అ | క | న | మ | డి |
| నె | జ | డి | ల | క్ష |
| టెం | న | ది | వ | న |
| కా | ర | మ | సా | రీ |
| య | ఆ | వా | లు | గ |

### జవాబులు

**• బ్రెయిన్ జిమ్**

| | | | | |
|---|---|---|---|---|
| అ | క | న | మ | డి |
| నె | జ | డి | ల | క్ష |
| టెం | న | ది | వ | న |
| కా | ర | మ | సా | రీ |
| య | ఆ | వా | లు | గ |

**• మైథోగ్రఫీ**

1. చక్రవాకం 2. కంసారాతి 3. రాముడు 4. ముచికుందుడు 5. ముదావతి

**• మాయా బజార్**

అడ్డం: 1. పెళ్లిపుస్తకం 4. సంబరం 5. అఆ 6. మెరుపుదాడి 9. ఈ 10. వారసుడు

నిలువు: 1. పెళ్లి సందడి 2. కంచె 3. దూకుడు 5. ఆమె 7. దాసి 8. తమ్ముడు

### • కిసుక్కు



భార్య: డబ్బు ఎక్కడ దాచినా మన పిల్లవాడు దొంగిలిస్తున్నాడండీ. ఏం చేయమంటారు?

భర్త: సింపుల్. వాడి టెక్స్ట్ బుక్‌లలో పెట్టు. అటు వైపు చచ్చినా చూడడు.

– ఆర్.జయంత్, నర్సీపట్నం

### • మీకు తెలుసా



అమ్మ గొప్పతనం గురించి ఎంతైనా చెప్పుకోవచ్చు. అమ్మ మన దగ్గర ఉంటే కొండంత ధైర్యం ఉంటుంది. తాజా విషయం ఏమిటంటే... ఒత్తిడిలో లేదా ఆందోళనలో ఉన్నవాళ్లు అమ్మతో కాసేపు మాట్లాడితే వాటి నుంచి బయటపడతారట. మనసు తేలిక పడుతుందట. అమ్మ గొంతులో నుంచి వచ్చే శబ్దం... ఒత్తిడిని నిరోధించే శక్తిగా మారుతుంది.

## పదశోధన - 443

నిర్వహణ : **అదృష్టదీపక్**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | | 2 | 3 | | 4 | | 5 |
| | | | 6 | | | | | 7 | |
| 8 | | 9 | | | | | | | |
| | | | | 10 | | | 11 | | |
| | 12 | | | | | 13 | | | |
| 14 | | | | | | 15 | | | 16 |
| | 17 | | 18 | | | | 19 | | |
| 20 | | | | | | 21 | | | |
| | | 22 | | | | 23 | | | |
| 24 | | | | | 25 | | | 26 | |

**ఆధారాలు**

**అడ్డం**

1. స్త్రీల ముంజేతి ఆభరణాలు (3)
2. కంఠం (2)
6. పాతాళభైరవిలో యస్వీ రంగారావు (7)
8. గ్రంథాలయం, ఖజానా (4)
11. వారు ఎక్కిన గుర్రం (3)
12. కష్టాలలో ఉన్నవారి మొక్కులు అందుకునే వెంకటేశ్వరుడు (8)
14. పెరుగులో నానబెట్టిన గారె (3)
15. తడబడిన వాక్కు (2)
17. జరగవలసిన పని – ఇది గంధర్వులే తీర్చారని లోకోక్తి (5)
19. వాసం మధ్య అక్షరంతో వచ్చే కాకి (3)
20. కృప, కనికరం (2)
22. పిల్లన గ్రోవి (3)
23. భర్త (2)
24. కపితో మొదలయ్యే ముని పేరు (4)
25. తుమ్మెద (2)
26. చోటు (2)

**నిలువు**

1. గాడిద గుడ్డు – తనికెళ్లభరణి నాటిక (4)
2. నీళ్లు నింపుకొనే పొడవైన పాత్ర (2)
3. కళగా ఉన్న భార్య (3)
4. నేల, భూమి (2)
5. శ్మశానం (2)
6. శిక్షార్హమైన తప్పు (2)
7. పుత్రుడు (4)
9. రూపం మారిన గాలిపటం (5)
10. పైకి లేచిన మొక్క (2)
11. వాలు (4)
12. వేసవిలో తెలుగువారి ఇంటింటి పచ్చడి (4)
13. ఆంగ్లేయుల అదృష్టం (2)
16. అసందర్భంగా రాయండి (5)
18. ఊర్మిళ భర్త (4)
20. దాహం (3)
21. నిప్పుల పాత్ర, పాతకాలపు స్టవ్ (3)
22. సహస్రాలు (2)

**పదశోధన - 442 జవాబులు**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఉ | 2 ద | రం | | 3 చి | 4 కా | బు | | 5 నీ | రు |
| 6 ప | త్తి | | 7 న | లు | వ | | 8 మె | డ | |
| పాం | | 9 క్రొ | డ | వ | లి | | ర | | 10 వి |
| 11 డ | గ్గ | త్తి | క | | 12 వా | డు | క | భా | ష |
| వు | | మీ | | 13 ఈ | డు | | భూ | | య |
| లు | | 14 ర | గ | డ | | 15 లే | మి | | సూ |
| | 16 ఇ | | | | 17 క | డి | | 18 కం | చి |
| | రు | | 19 అ | 20 ద | ను | | 21 పా | దు | క |
| 22 అ | వ | | 23 పూ | రి | పా | 24 క | | కూ | |
| 25 ఆ | ది | ప | ర్వం | | 26 ప | రి | చా | రి | క |

### ● ఫుడ్ పిరమిడ్

పి
జ్జా చీ జ్
గ్గ బ ర్ ట నా
న్ తా య్ క మా టా సూ
ప్ కా ర్న్ స్వీ ట్ వె మ ల్రీ ట్లె

పక్కన ఫుడ్ పిరమిడ్‌లో కనిపిస్తున్న అక్షరాలలో కొన్ని ఆహార పదార్థాలు, వంటకాల పేర్లు దాగున్నాయి. కనుక్కొనేందుకు ప్రయత్నించండి. ఇది మీ పాకశాస్త్ర పరిజ్ఞానానికి ఒక తమాషా పరీక్ష.

ఈ అక్షరాలతో ఎన్ని ఎక్కువ పదాలను కనుక్కోగలిగితే మీకు అంత ఎక్కువగా పాక పరిజ్ఞానం ఉన్నట్లు లెక్క. ఒక్కో పదానికి ఒక్కో మార్కు లెక్కన ఎన్ని వస్తాయో చూసుకోండి.

**మార్కులు**
ఫర్వాలేదు: 16
బాగుంది: 18
అద్భుతం: 20



### ● పదవినోదం

గడులలో అస్తవ్యస్తంగా ఇచ్చిన అక్షరాలను సరైన వరుసలో పదాలుగా అమర్చండి. గడులలో వృత్తాల నడుమ ఇచ్చిన అక్షరాలతో వచ్చే అర్థవంతమైన పదబంధాన్ని కనుక్కోండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ధో | (మూ) | ర | (స) | ణి |
| 2 | (లు) | క్తు | (హి) | తో | |
| 3 | (హ) | (మ) | రం | త్త | |
| 4 | క్షు | ము | (ము) | వు | |

**పదవినోదం జవాబులు**

హి మ స మూ హ ము లు

1.మూసధోరణి 2.హితోక్తులు 3.మహత్తరం 4.ముముక్షువు

### సుడోకు - 203

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 4 | | 7 | | | | 8 | | 2 |
| | | 5 | 3 | | 8 | | | |
| 9 | | | 6 | | | 5 | | |
| 8 | 1 | | | 9 | | | 5 | 7 |
| 2 | | | 4 | | | | | 6 |
| 5 | | | | | | | | |
| | | | 7 | 8 | 3 | | | 5 |
| | | 4 | | | | | | 3 |
| | | | | 1 | | | | |

కఠిన స్థాయి
1 2 3 4 5

**సుడోకు - 202**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 5 | 7 | 3 | 6 | 8 | 4 | 9 | 2 |
| 8 | 6 | 4 | 5 | 9 | 2 | 1 | 7 | 3 |
| 3 | 2 | 9 | 4 | 1 | 7 | 8 | 6 | 5 |
| 6 | 4 | 3 | 2 | 8 | 1 | 7 | 5 | 9 |
| 5 | 9 | 8 | 6 | 7 | 4 | 2 | 3 | 1 |
| 2 | 7 | 1 | 9 | 3 | 5 | 6 | 4 | 8 |
| 7 | 1 | 5 | 8 | 4 | 9 | 3 | 2 | 6 |
| 4 | 3 | 2 | 1 | 5 | 6 | 9 | 8 | 7 |
| 9 | 8 | 6 | 7 | 2 | 3 | 5 | 1 | 4 |

## 9 జూలై నుంచి 15 జూలై 2017 వరకు


సింహంభట్ల సుబ్బారావు
జ్యోతిష్య పండితులు






**మేషం:** (అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)
ముఖ్యమైన కార్యక్రమాలలో విజయం సాధిస్తారు. భూములు, వాహనాలు కొనుగోలు చేస్తారు. విద్యార్థులకు శుభవార్తలు. వ్యాపారాలు ఉత్సాహవంతంగా సాగుతాయి. ఉద్యోగులకు ఇంక్రిమెంట్లు రాగలవు. పారిశ్రామికవర్గాలకు సన్మానాలు. వారం ప్రారంభంలో వృథా ఖర్చులు. అనారోగ్యం. గులాబీ, లేత పసుపు రంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. వేంకటేశ్వరస్వామి స్తోత్రాలు పఠించండి.



**వృషభం:** (కృత్తిక 2,3,4 పా, రోహిణి, మృగశిర 1,2 పా.)
ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది. జీవిత భాగస్వామి ద్వారా ఆస్తిలాభ సూచనలు. ఆలయాలు సందర్శిస్తారు. ఆస్తి వ్యవహారాలలో చిక్కులు తొలగుతాయి. దూరప్రాంతాల నుంచి కీలక సమాచారం. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగులకు కొత్త హోదాలు దక్కుతాయి. రాజకీయవర్గాలకు పదవులు వరిస్తాయి. నీలం, లేత ఎరుపు రంగులు. ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. దక్షిణామూర్తి స్తోత్రాలు పఠించండి.



**మిథునం:** (మృగశిర 3,4, ఆరుద్ర, పునర్వసు 1,2,3 పా.)
ఆర్థిక విషయాలు సంతృప్తినిస్తాయి. ఆరోగ్యంపై శ్రద్ధ వహించండి. బంధువర్గంతో నెలకొన్న వివాదాలు తీరతాయి. శత్రువులు మిత్రులుగా మారతారు. దేవాలయాలు సందర్శిస్తారు. వ్యాపార లావాదేవీలలో ముందడుగు వేస్తారు. ఉద్యోగులకు ఒత్తిడులు తొలగుతాయి. కళాకారులకు శుభవార్తలు. వారం మధ్యలో ధనవ్యయం. స్వల్ప అనారోగ్యం. పసుపు, ఆకుపచ్చ రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణుసహస్రనామ పారాయణ చేయండి.



**కర్కాటకం:** (పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)
ఆస్తి వ్యవహారాలు కొలిక్కివస్తాయి. గృహం, వాహనాలు కొనుగోలు చేస్తారు. నిరుద్యోగులకు ఉద్యోగలాభం. వివాహయత్నాలు కలిసివస్తాయి. ఆర్థిక వ్యవహారాలలో పురోగతి కనిపిస్తుంది. వ్యాపారాలు లాభసాటిగా ఉంటాయి. ఉద్యోగులకు పనిభారం నుంచి విముక్తి. రాజకీయవర్గాలకు నూతనోత్సాహం. వారం చివరిలో వివాదాలు. ఆర్థిక ఇబ్బందులు. పసుపు, లేత ఎరుపు రంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. కనకదుర్గాదేవి స్తోత్రాలు పఠించండి.



**సింహం:** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)
కొత్త పనులకు శ్రీకారం చుడతారు. ఆస్తి వివాదాలు కొంత వరకూ పరిష్కారం. ఆశించిన ఆదాయం పొందుతారు. వాహనయోగం. నిరుద్యోగులకు కొత్త ఆశలు. ఇంటి నిర్మాణయత్నాలు కార్యరూపం దాలుస్తాయి. వ్యాపారాలు పుంజుకుంటాయి. ఉద్యోగులకు ఇంక్రిమెంట్లు రాగలవు. పారిశ్రామికవేత్తలకు సన్మానాలు. వారం చివరిలో వ్యయప్రయాసలు. మానసిక అశాంతి. పసుపు, నేరేడు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. ఆంజనేయస్వామిని పూజించండి.



**కన్య:** (ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1,2 పా.)
ఆర్థిక ఇబ్బందులు తీరి ఊరట లభిస్తుంది. ప్రముఖులతో పరిచయాలు ఏర్పడతాయి. గత సంఘటనలు గుర్తుకు తెచ్చుకుంటారు. బంధుమిత్రులతో ఉత్సాహంగా గడుపుతారు. వ్యాపారాల విస్తరణలో ఆటంకాలు తొలగుతాయి. ఉద్యోగస్తులకు అనుకూల సమయం. కళాకారులకు ప్రయత్నాలలో ప్రగతి కనిపిస్తుంది. వారం మధ్యలో ధనవ్యయం. స్వల్ప అనారోగ్యం. లేత ఆకుపచ్చ, గులాబీ రంగులు. తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. అంగారక స్తోత్రం పఠించండి.



**తుల:** (చిత్త 3,4, స్వాతి, విశాఖ 1,2,3 పా.)
ఆర్థిక వ్యవహారాలు కొంత వరకూ అనుకూలిస్తాయి. నూతన విద్యావకాశాలు దక్కుతాయి. గృహం,వాహనాల కొనుగోలు యత్నాలలో పురోగతి ఉంటుంది. వ్యాపార లావాదేవీలు స్వల్పంగా లాభిస్తాయి. ఉద్యోగులకు అనుకూల మార్పులు. రాజకీయవర్గాలకు విదేశీ పర్యటనలు. వృథా ఖర్చులు. నీలం, లేత ఆకుపచ్చ రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. నవగ్రహస్తోత్రాలు పఠించండి.

**వృశ్చికం:** (విశాఖ 4 పా., అనూరాధ, జ్యేష్ఠ)
ఆర్థిక పరిస్థితి కొంత గందరగోళంగా ఉంటుంది. అనుకున్న పనుల్లో జాప్యం. నిరుద్యోగులు, విద్యార్థులకు ఒత్తిడులు. వ్యాపారాలు నిరాశాజనకంగా ఉంటాయి. ఉద్యోగస్తులకు పైస్థాయి నుంచి ఒత్తిడులు. కళాకారులకు పర్యటనలు వాయిదా. వారం మధ్యలో శుభవార్తలు. ఆకస్మిక ధనలబ్ధి. ఎరుపు, తెలుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. హనుమాన్‌ఛాలీసా పఠించండి.

**ధనుస్సు:** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)
ఆర్థిక పరిస్థితి ఆశాజనకంగా ఉంటుంది. సన్నిహితుల సాయంతో కొన్ని పనులు పూర్తి చేస్తారు. పోటీపరీక్షల్లో విజయం. వాహనాలు, భూములు కొనుగోలు చేసే వీలుంది. ఆలోచనలు అమలు చేస్తారు. వ్యాపార లావాదేవీలు ఊపందుకుంటాయి. ఉద్యోగులకు ప్రోత్సాహకరంగా ఉంటుంది. కళాకారుల యత్నాలు ఫలిస్తాయి. వారం చివరిలో వ్యయప్రయాసలు. మిత్రులతో వివాదాలు. గులాబీ, పసుపురంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. శివాష్టకం పఠించండి.

**మకరం:** (ఉత్తరాషాఢ 2,3,4, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)
ఆర్థిక పరిస్థితి గతం కంటే మెరుగ్గా ఉంటుంది. చేపట్టిన కార్యక్రమాలు సకాలంలో పూర్తి చేస్తారు. మీపై వచ్చిన అభాండాలు తొలగుతాయి. పరిచయాలు పెరుగుతాయి. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. వ్యాపారాలలో ముందడుగు వేస్తారు. ఉద్యోగులకు పనిభారం తగ్గుతుంది. పారిశ్రామికవర్గాలకు నూతనోత్సాహం. వారం ప్రారంభంలో వృథా ఖర్చులు. ఆరోగ్యభంగం. నేరేడు, ఆకుపచ్చ రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. గణపతి స్తోత్రాలు పఠించండి.

**కుంభం:** (ధనిష్ఠ 3,4, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా.)
వీరికి పట్టింది బంగారమే. ఇంటిలో శుభకార్యాలపై చర్చలు సాగిస్తారు. విద్యార్థులకు అనుకూల ఫలితాలు ఉంటాయి. చిరకాల ప్రత్యర్థులు కూడా అనుకూలురుగా మారతారు. వాహనయోగం. వ్యాపారాలు లాభాల దిశగా సాగుతాయి. ఉద్యోగులకు పదోన్నతులు రావచ్చు. రాజకీయవర్గాలకు సత్కారాలు. వారం ప్రారంభంలో స్వల్ప అనారోగ్యం. ధనవ్యయం. నలుపు, నీలం రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణుసహస్రనామ పారాయణ చేయండి.

**మీనం:** (పూర్వాభాద్ర 4 పా., ఉత్తరాభాద్ర, రేవతి)
అనుకున్న ఆదాయం సమకూరుతుంది. విద్యార్థుల ప్రతిభ వెలుగులోకి వస్తుంది. ఆస్తి వివాదాల నుంచి గట్టెక్కుతారు. ఆలయాలు సందర్శిస్తారు. జీవిత భాగస్వామి ద్వారా ఆస్తి లేదా ధనలాభం. నిరుద్యోగులకు శుభవార్తలు. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగులకు పదోన్నతులు. కళాకారులకు ఊహించని అవకాశాలు. వారం మధ్యలో అనారోగ్యం. కుటుంబంలో చికాకులు. గులాబీ, ఎరుపు రంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. కనకధారా స్తోత్రం పఠించండి.

• టారో

9 జూలై నుంచి
15 జూలై
2017 వరకు

















టారో ఇన్సియా
రేఖీ అనలిస్ట్

**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 19)**

ఈ వారం విజయవంతంగా సాగుతుంది. పనులన్నీ త్వర త్వరగా అవుతాయి. మీ నీతి నిజాయితీల వల్ల మీరు గతంలో ఏదో కోల్పోయారనుకున్నవన్నీ ఈ వారం మీకు లభిస్తాయి. మీ పాత పద్ధతులకు, కాలం తీరిపోయిన విధానాలకు స్వస్తి చెప్పి కొత్తదనాన్ని అవలంబించడం మంచిది.

**కలిసొచ్చే రంగు: నారింజ**

**వృషభం (ఏప్రిల్ 20 - మే 20)**

ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. కాలాను గుణంగా మారతారు. మార్పులకు స్వాగతం పలుకుతారు. కొత్త బంధాలు, బంధుత్వాలు, స్నేహాలు కలుస్తాయి. వివాదాస్పదమైన మాటలకు, ప్రవర్తనకు దూరంగా ఉండటం మంచిది. వ్యాపారంలో లాభాలు లేదా ఉద్యోగులకు బోనస్ వచ్చే అవకాశం ఉంది.

**కలిసొచ్చే రంగు: నీలం**

**మిథునం (మే 21 - జూన్ 20)**

మనసు చెప్పే మాటను కాస్త శ్రద్ధ పెట్టి వినండి. మీ కలలు సాకారం అయ్యే అవకాశం ఉంది. కొన్ని ముఖ్య సంఘటనలు చోటు చేసుకోవచ్చు. ప్రాజెక్టులు కొన్ని అనివార్య కారణాల వల్ల ఆగిపోవచ్చు. మీ విచక్షణ, తెలివితేటలను ఉపయోగించి, అవరోధాలను అధిగమిస్తారు. రిస్క్‌తో కూడిన పెట్టుబడులకు దూరంగా ఉండండి.

**కలిసొచ్చే రంగు: లేత పసుపు**

**కర్కాటకం (జూన్ 21 - జూలై 22)**

భావోద్వేగాలను నియంత్రించుకోవడంలో నైపుణ్యం సాధించాలి. విజయావకాశాలను జాగ్రత్తగా ఒడిసిపట్టుకోగలగాలి. గతంలో మీరు తీసుకున్న ఒక నిర్ణయం ఇప్పుడు సత్ఫలితాలనిస్తుంది. మీ గమ్యాన్ని మార్చే ప్రయాణం ఉండవచ్చు. సానుకూల ఫలితాలు ఎన్నో ఉన్నాయి.

**కలిసొచ్చే రంగు: చిలకపచ్చ**

**సింహం (జూలై 23 - ఆగస్ట్ 22)**

స్థిరత్వానికి, భద్రతకు అనుకూల కాలమిది. అదేవిధంగా గృహనిర్మాణానికి, కొత్త పని ప్రారంభానికి, పెళ్లి ప్రయత్నాలకు చేసే ఆలోచనలు కలిసి వస్తాయి. ప్రతిబంధకాలను అధిగమిస్తారు. గతం నుంచి బయటపడి వర్తమానంలో జీవించడం మంచిది. ఇబ్బడిముబ్బడిగా డబ్బు అందుతుంది. మీ ప్రయత్నాలకు ఊతం దొరుకుతుంది.

**కలిసొచ్చే రంగు: పసుపు**

**కన్య (ఆగస్ట్ 23 - సెప్టెంబర్ 22)**

వేయబోయే అడుగు మంచిదో కాదో తెలియక తికమకపడవద్దు. తెగించి ముందడుగు వేస్తే అనుకూల ఫలితాలను అందుకుంటారు. ఈ వారం మీకు శుభవార్తలు అందుతాయి. వాతావరణం ప్రోత్సాహకరంగా ఉంటుంది. కెరీర్ బాగుంటుంది. ప్రేమ ఫలిస్తుంది.

**కలిసొచ్చే రంగు: దొండపండు**

**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 22)**

శుభవర్తమానం అందుతుంది. ఆత్మీయులతో మాట్లాడేటప్పుడు మనస్ఫూర్తిగా మాట్లాడండి. మీ ప్రేమను దాచిపెట్టవద్దు. ఈ వారం జరిగేవన్నీ మీ భావోద్వేగాలకు సంబంధించినవే. ఎంతోకాలంగా ఎదురు చూస్తున్న మార్పు జరుగుతుంది. ప్రయాణావకాశం ఉంది. కెరీర్ పరంగా బాగుంటుంది. ఇల్లు లేదా కార్యాలయం మారతారు.

**కలిసొచ్చే రంగు: ఇటికరాయి రంగు**

**వృశ్చికం (అక్టోబర్ 23 - నవంబర్ 21)**

మంచి రోజులు ముందున్నాయి. ఉద్యోగంలో మార్పు వచ్చే అవకాశం ఉంది. పనిలో మీ ధోరణిని మార్చుకోవలసి వుంది. సానుకూల ధోరణితో చేసే పనులు ఫలప్రదం అవుతాయి. ధనపరంగా, పెట్టుబడుల పరంగా మీరు కొంచెం ఆచితూచి నిర్ణయాలు తీసుకోవడం అవసరం. త్యాగం చేయవలసి వస్తుంది.

**కలిసొచ్చే రంగు: ముదురు గోధుమ**

**ధనుస్సు (నవంబర్ 22 - డిసెంబర్ 21)**

ఈ వారమంతా చాలా బిజీగా గడుపుతారు. ఊపిరి సలపనంతటి పనుల ఒత్తిడిలో తల మునకలవుతారు. అయితే, పనిలో రొడ్డకొట్టుడు, మూస ధోరణి ఉన్నంతకాలం మీకది వర్కవుట్ కాదు. కొత్తగా ఆలోచించాల్సి ఉంటుంది. భావోద్వేగాలలో చాలా మార్పు చేర్పులు జరుగుతాయి. ధ్యానం స్వాంతననిస్తుంది.

**కలిసొచ్చే రంగు: వంకాయ రంగు**

**మకరం (డిసెంబర్ 22 - జనవరి 19)**

శుభవార్తల కోసం ఎదురు చూడవచ్చు. ఆర్థికలావాదేవీలు లాభదాయకం. గతంలో పెట్టిన పెట్టుబడుల నుంచి పెద్దమొత్తాలు చేతి కందుతాయి. మీరెప్పుడూ ఊహించని అవకాశాలు వెల్లువెత్తుతాయి. అనుకూలమైన వాటిని ఎంచుకుని ధైర్యంగా ముందడుగు వేయండి. వివాహ ఘడియలు సమీపించాయి.

**కలిసొచ్చే రంగు: ముదురాకుపచ్చ**

**కుంభం (జనవరి 20 - ఫిబ్రవరి 18)**

గత కొద్దికాలంగా మీరు ఎదుర్కొంటున్న గడ్డు పరిస్థితుల నుంచి బయట పడతారు. మనశ్శాంతి, స్థిమితం లభిస్తాయి. బయటినుంచి డబ్బు చేతికందుతుంది. మీ పథకాలు ఫలిస్తాయి. కలలు సాకారమవుతాయి. మనసు పెట్టి పని చేయడం మంచిది. కొత్త వాహనం కొనుగోలు చేయచ్చు.

**కలిసొచ్చే రంగు: నలుపు**

**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20)**

ఆర్థికంగా చాలా బాగుంటుంది. ధనపరంగా మీరు కంటున్న కలలు ఫలిస్తాయి. బాగా షాపింగ్ చేసి, మనసు పడ్డవాటన్నింటినీ కొంటారు. వ్యాపారంలో మాత్రం తన, పరభేదాలు వద్దు. కష్టే ఫలి అన్నట్లుగా పని చేయండి, అప్పుడు విజయం మీ సొంతమవుతుంది. వాస్తవ విరుద్ధమైన ఆలోచనలు చేయవద్దు.

**కలిసిచ్చే రంగు: ముదురాకుపచ్చ**

● పాటతత్వం



కోటి
సంగీత దర్శకుడు

# గుండె నిండ గుడి గంటలు...

'శుభాకాంక్షలు' చిత్రంలోని 'గుండె నిండ గుడి గంటలు' పాటకు సంబంధించి నాకు ఒక మంచి అనుభవం ఉంది. ఈ చిత్రంలోని పాటలను నేను తిరుపతి పద్మావతి గెస్ట్‌హౌస్‌లో ఉన్నప్పుడు కంపోజింగ్ చేశాను. తిరుమల కొండ మీద నా మనసులో పుట్టిన ఈ ట్యూన్‌ని వెంటనే బయటకు హమ్ చేశాను. ట్యూన్‌లో ఉన్న అందాన్ని మాటలలో చూపారు సీతారామశాస్త్రి. ఎత్తుగడ కోసం చాలాసేపు నిరీక్షిస్తాను. సరిగ్గా రాగానే, దాని నుంచి అల్లుకుంటూ పోతాను. నా పాట అందరూ పాడుకోవాలనే భావనతో ట్యూన్ చేస్తాను. అలా చేసినదే ఈ పాట కూడా.

ఈ పాటలో శాస్త్రి గారు ప్రేమను ఎంతో అందంగా వివరించారు. ఇంతకుమించి అందంగా ఎవ్వరూ చెప్పలేరేమో అనిపిస్తుంది. గుండెల్లో గుడిగంటలు, గువ్వల గొంతులు, కళ్లల్లో సంక్రాంతులు... ఇన్ని మార్పులు చోటు చేసుకుంటే అదిప్రేమ అని ఎంతో అందంగా వర్ణించారు.

**పరిచయమే చేశావే నన్నే నాకు కొత్తగ ఓ ప్రేమా...** అద్భుతమైన పద ప్రయోగం. ప్రేమలో పడినవారి మనసులో కొత్త కొత్త ఆలోచనలు




మొలకెత్తుతాయి. సృష్టిలో అన్నీ కొత్తగా కనిపిస్తాయి. అంతవరకు తాను ఎవరో తనకు తెలుసు. కాని ప్రేమలో పడిన క్షణం నుంచి తాను ఎవరో మళ్లీ తనకు పరిచయం చేయాలి తన మనసు... అనే విషయాన్ని అద్భుతంగా చెప్పారు సిరివెన్నెల.

**మౌనాన్నే ఆశ్రయించే ఎన్నెన్నో ఊసులు, తెరిచిన కనులే కలలకు నెలవై... కదలని పెదవే కవితలు చదివే** ప్రేమను ఇంతకు మించి ఎవరైనా వివరించగలరా అనిపించేలా ఉంటాయి ఈ మాటలు. నిజమైన ప్రేమికుల మధ్య ఊసులన్నీ మౌనంగా ఉంటాయి. కనులు తెరచి కలలు కంటారు, పెదవులు మౌనంగా కవితలు వినిపిస్తాయి. నిజమైన ప్రేమలో ఒక్క క్షణం గడిపినా చాలు వారి జీవితమే చరిత్రగా మారిపోతుందని ప్రేమను ఉన్నతస్థాయిలో చూపారు సిరివెన్నెల. మా ఇద్దరి కాంబినేషన్‌లో ఎన్నో హిట్ సాంగ్స్ వచ్చాయి.

నేను ట్యూన్ ఇచ్చేటప్పుడే మనసులో కొన్ని పదాలు అనుకుని, వాటికి అనుగుణంగా ట్యూన్ తయారుచేస్తాను. అందుకు తగ్గట్టుగానే రచయితలు మంచి మంచి పదాలు వేసి నా ట్యూన్‌కి మరింత వన్నె తీసుకువస్తారు. అటువంటి పాటల్లో ఒకటైన ఈ పాటంటే నాకు అపురూపం.

**- సంభాషణ: డా. వైజయంతి**

● పురానీతి

# గురు అనుగ్రహం

అది అమరావతీ నగరం. దేవేంద్రుడు తన గణాలతో కొలువు దీరి ఉన్నాడు. అప్సరాంగనలు తమ అద్వితీయమైన నృత్యగానాలతో సభికులను రంజింపజేస్తున్నారు. ఇంద్రుడు శచీదేవితో కూడి ఆ నృత్యగానాలను మైమరచిపోయి చూస్తున్నాడు. ఆ సమయంలో దేవగురువైన బృహస్పతి కొలువులో ప్రవేశించాడు. ఇంద్రుడు ఆయనను చూసి కూడా చూడనట్లు ఉన్నాడు. బృహస్పతి మనసు నొచ్చుకుంది. వెంటనే వెనక్కు తిరిగి తన నివాసానికి వెళ్లిపోయాడు.

నాట్యం పూర్తయిన తర్వాత ఇంద్రుడు ఈ లోకానికి వచ్చాడు. తాను చేసిన తప్పు తెలుసుకున్నాడు. వెంటనే గురువు పాదాల మీద పడి ఆయనను ప్రసన్నం చేసుకుందామన్న ఆలోచనతో బృహస్పతి నివాసానికి బయలుదేరాడు. ఇది తెలుసుకున్న బృహస్పతి అక్కడినుంచి మాయమవడంతో గురు నివాసానికి వెళ్లి ఆయనను దర్శించుకోలేక ఇంద్రుడు సిగ్గుతో తిరిగి వస్తాడు.

ఇంద్రుడు గురువు అనుగ్రహానికి దూరమయ్యాడని గ్రహించిన రాక్షసులు ఇదే తగిన సమయంగా భావించి అమరావతిని ముట్టడించారు. అతి సునాయాసంగా దేవతలను జయించారు. దిక్కుతోచక దేవతలందరూ కలిసి బ్రహ్మదేవుని ఆశ్రయించారు. ఆయన ఇంద్రాది దేవతలకు ఉద్దేశించి ''గురువు అనుగ్రహానికి దూరమైనవారిని ఎవరూ ఏమీ చేయలేరు. రాక్షసులు తమ గురువైన శుక్రాచార్యుని ఆరాధించి, ఆయన అనుగ్రహాన్ని అపారంగా పొంది, బలాన్ని, శక్తిసామర్థ్యాలను పుంజుకుని మిమ్మల్ని జయించగలిగారు. మీరందరూ కలసి ఎలాగైనా బృహస్పతి అనుగ్రహాన్ని తిరిగి సంపాదించే ప్రయత్నం చేయండి. బృహస్పతి కొంతకాలం పాటు తపస్సమాధిలో నిమగ్నం అయ్యాడు. ఈలోగా మీరు విశ్వరూపుడనే అతన్ని గురువుగా చేసుకుని ఆయన ఆశీస్సులు పొందండి''అని సలహా ఇచ్చాడు.

దేవతలు విశ్వరూపుని గురువుగా చేసుకుని ఆయన సలహా మేరకు నారాయణ కవచాన్ని పొంది, దాని ప్రభావంతో తిరిగి రాక్షసులను జయించారు. నెమ్మదిగా ఇంద్రాది దేవతలందరూ కలసి బృహస్పతిని ఆరాధించి ఆయనను ప్రసన్నం చేసుకుని తిరిగి తమ గురువుగా చేసుకున్నారు.



ఎంతటి వారికైనా గురువు అనుగ్రహం అవసరం అని బోధించే ఈ కథ వ్యాసప్రణీతమైన మహాభారతంలోనిది. వ్యాసుడు శంఖచక్రాలు లేని శ్రీ మహావిష్ణువు, మూడవ కన్నులేని శివుడు, నాలుగు ముఖాలు లేని బ్రహ్మ. అటువంటి వ్యాసభగవానుడు ఉద్భవించిన ఆషాఢపున్నమికే గురుపౌర్ణమి అని పేరు. ఈ పర్వదినాన గురువులను పూజించడం, సేవించడం శుభఫలితాలనిస్తుంది.



డా॥ వేనాటి శోభ
లీలా హాస్పిటల్
మోతీనగర్,
హైదరాబాద్

# వీటి కోసం మాత్రలు ఉంటాయా?

**• ఈస్ట్రోజెన్, ప్రొజెస్టరాన్ లాంటి హార్మోన్లు స్త్రీలకు చాలా ముఖ్యం అనే విషయం చదివాను. వీటి కోసం ప్రత్యేక మాత్రలు ఏమైనా ఉంటాయా? మాత్రలు లేకపోతే ఎలాంటి ఆహారపదార్థాలు తీసుకుంటే ఈ హార్మోన్లు బలపడతాయి అనేది తెలియజేయగలరు.**

**- ఎన్.జయ, ఖమ్మం**

ఈస్ట్రోజన్, ప్రొజెస్టరాన్ హార్మోన్లు స్త్రీల ఆరోగ్యానికి, పీరియడ్స్ సరిగా రావటానికి, గర్భం నిలవటానికి ఎంతో ముఖ్యం. అవి ఆడవారిలో అండాశయాల నుంచి ఒక్కొక్కరి శరీర తత్వాన్ని బట్టి రకరకాల మోతాదులో విడుదల అవుతూ ఉంటాయి. విటమిన్ టాబ్లెట్స్‌లాగా, ఈస్ట్రోజన్, ప్రొజెస్టరాన్ మాత్రలని ఆరోగ్యం కోసం వాడకూడదు. ఈ హార్మోన్స్ మరీ అధికంగా ఉన్నా, మరీ తక్కువగా ఉన్నా మంచిది కాదు. ఈ హార్మోన్లు శరీర బరువుని బట్టి, మానసిక, శారీరక ఒత్తిడిని బట్టి విడుదల అవుతూ ఉంటాయి. ఈ మాత్రలు పీరియడ్స్ ఇర్రెగ్యులర్‌గా ఉన్నప్పుడు, అండాశయాలలో సిస్ట్‌లు... ఇంకా కొన్ని సమస్యలకు డాక్టర్ సలహా సంరక్షణలో వాడవలసి ఉంటుంది. పరిమితమైన పౌష్టికాహారం, సక్రమంగా వాకింగ్, వ్యాయామాలు చేసుకుంటూ సాధారణ బరువుతో ఉంటే, ఈ హార్మోన్స్, శరీరంలో కావాల్సిన మోతాదులో విడుదల అవుతాయి. సాధారణంగా పీరియడ్స్ ఆగిపోయినవారిలో ఈస్ట్రోజన్ తగ్గిపోతుంది కాబట్టి, వారికి ఆహారంలో సోయా బీన్స్, సోయా పాలు, సోయా ఉత్పత్తులలో ఈస్ట్రోజన్‌లాగా పనిచేసే ఫైటో ఈస్ట్రోజన్స్, ఐసోఫ్లావోన్స్ ఉంటాయి కాబట్టి, వాటిని తీసుకోమని సలహా ఇవ్వడం జరుగుతుంది.

**• సోనోగ్రఫీ టెస్ట్ (sonography test) గురించి మొదటి సారిగా విన్నాను. గర్భిణులకు ఇది ముఖ్యమైన టెస్ట్ అనే విషయం తెలిసింది. ఈ టెస్ట్ ఏ రకంగా గర్భిణులకు ఉపయోగం అనేది కాస్త వివరంగా తెలియజేయగలరు.**

**- యస్.ఎన్, నెల్లిమర్ల**

సోనోగ్రఫీ టెస్ట్ అంటే అల్ట్రా సౌండ్ స్కానింగ్. దీనిని అల్ట్రా సౌండ్ మెషిన్ ద్వారా చేస్తారు. పిండం గర్భంలో పెరుగుతుందా లేదా గర్భాశయంలో పెరుగుతుందా లేదా ట్యూబ్‌లో పెరుగుతుందా, పిండంలో గుండె కొట్టుకోవడం మొదలైందా అనేవి మొదటి మూడు నెలల సమయంలో ఈ టెస్ట్ ద్వారా తెలుస్తుంది. మూడవ నెల చివరిలో, బిడ్డలో చిన్నగా చేతులు, కాళ్లు, ఏర్పడి బిడ్డ రూపం ఏర్పడుతుంది. ఎన్‌టీ స్కాన్ ద్వారా బిడ్డలో కొన్ని జన్యులోపాలు అలాంటప్పుడు స్కానింగ్ ద్వారా తెలుసుకోవలసి ఉంటుంది. కొందరిలో మొదటి మూడు నెలలలో కొద్దిగా బ్లీడింగ్, స్పాటింగ్ కనిపిస్తుంది. అప్పుడు కూడా పిండం ఎలా ఉంది అనేది స్కానింగ్ ద్వారానే తెలుస్తుంది.

ఐదవ నెల చివరిలో బిడ్డలో అవయవ లోపాలు ఏమైనా ఉన్నాయా అని తెలుసుకోవడానికి టిఫ్ఫా స్కానింగ్ చేయించుకోవలసి ఉంటుంది. అవసరమయితే బిడ్డ గుండెలో చిన్న రంధ్రాలు, గుండెకు



ముందుగా గుర్తించే అవకాశం ఉంటుంది. మొదటి మూడు నుంచి నాలుగు నెల వరకు పొట్ట పైనుంచి గర్భంలో పిండం పెరుగుతుందా లేదా అనేది తెలియదు. నాలుగో నెల చివరి నుంచి పొత్తికడుపు పైన, కొద్దిగా గర్భాశయం పెరిగి పైకి గట్టిగా తెలుస్తుంది. డాప్లర్ అనే పరికరం ద్వారా బిడ్డ గుండె కొట్టుకోవడం వినిపిస్తుంది. అదే పొట్టమీద కొవ్వు ఎక్కువగా ఉంటే బిడ్డ గుండె శబ్దం వినిపించకపోవచ్చు.

సంబంధించిన వేరే లోపాలు సరిగ్గా తెలుసుకోవటానికి ఫీటల్ 2డి ఎకో స్కాన్ ఉంటుంది. 8, 9 నెలలలో బిడ్డ బరువు, ఉమ్మ నీరు, పొజిషన్ తెలుసుకోవటానికి గ్రోత్ స్కాన్ చేయించుకోవచ్చు. బిడ్డ బరువు తక్కువగా ఉండి, ఉమ్మ నీరు తగ్గుతుంటే, డాప్లర్ స్కాన్ ద్వారా బిడ్డకి తల్లి నుండి రక్త ప్రసరణ ఎలా ఉందో తెలుసుకోవచ్చు.



## ఇంగ్లిష్ నేర్చుకుందాం

ఈ చిత్రంలో ఉన్న జంతువుల ఇంగ్లిష్ పేర్లు గడులలో దాగున్నాయి. అవి ఎక్కడ ఉన్నాయో కనిపెట్టి మార్క్ చేయండి.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| Z | E | B | G | I | R | A | F | F | E |
| E | C | R | O | C | O | D | I | L | E |
| B | W | K | S | J | Y | R | U | J | N |
| R | R | C | H | V | S | B | L | M | F |
| A | H | A | E | D | B | D | I | J | I |
| G | T | T | E | C | B | D | O | U | S |
| D | F | H | P | V | E | P | N | R | H |
| D | K | A | N | G | A | R | O | O | Y |
| S | D | E | S | T | I | G | E | R | R |
| H | I | P | P | O | T | A | M | U | S |
| T | I | G | F | I | S | C | R | A | B |



## జత కలపండి

కుడి, ఎడమ వైపు ఇచ్చిన బొమ్మలను చూస్తూ... ఏ భాగానికి ఏది జత అవుతుందో గుర్తించండి.




## రంగులు వేయండి

ఈ చిత్రంలోని చుక్కలను కలిపి, రంగులు వేసి అందంగా తీర్చిదిద్దండి.




## ఆ తరువాత?

ఎడమవైపు ఇచ్చిన బొమ్మల వరుసక్రమాన్ని పరిశీలించి, కుడివైపు ఇచ్చిన బొమ్మలలో ఖాళీ గడులలో ఏవి రావాలో రాయండి.





### జవాబులు

ఆ తరువాత: 1-A, 2-B, 3-C, 4-B

జత కలపండి: 1-D, 2-C, 3-B, 4-A

ఇంగ్లిష్ నేర్చుకుందాం:

ఫన్‌డే మీద మీ అభిప్రాయాలను, సూచనలను మాకు తెలియజేయండి. ప్రియదర్శిని రామ్, ఎడిటర్, ఫన్‌డే, సాక్షి దినపత్రిక, 6-3-249/1, రోడ్ నం.1, బంజారాహిల్స్, హైదరాబాద్ – 34. funday.sakshi@gmail.com

బుక్ డిజైనింగ్: కుసుమ





## దారి చూపండి

తేనెటీగ పువ్వు దగ్గరికి వెళ్లాలి. కానీ దారి తెలియక తికమకపడుతోంది. మీరు దారి చూపి సహాయం చేయండి.

## అది ఏది?

ఎడమ వైపు మొసలి బొమ్మ, కుడివైపు ఆరు నీడలు ఉన్నాయి కదా... ఆ నీడలలో మొసలి నీడ ఏదో కనిపెట్టండి.








## టక్కున చెప్పండి

ఈ చిత్రంలో ఎన్ని డైనోసర్లు ఉన్నాయో టక్కున లెక్కించి చెప్పండి.




## ఏది ఎక్కడికి?

మూడు గుర్రాలలో ఒక్కొక్కటి ఒక్కో వైపు చూస్తోంది. వాటిలో ఏది ఎక్కడికి వెళ్తుందో కనిపెట్టండి.

### జవాబులు

అది ఏది: 6

టక్కున చెప్పండి: 8

ఏది ఎక్కడికి: A-3, B-1, C-2

దారి చూపండి:



RNI Reg No.APTEL/2008/23482